దొడ్డిదారిన అధికారంలోకి
వచ్చిన తిరుగుబాటు
తెలుగుదేశం వంచన,
వైఫల్యాలపై

# ప్రజాకోర్టులో
# బిజెపి చార్జిషీట్

సంపుటి: 4 జనవరి 1998 సంచిక: 12

**ఉదయకమలం**

తెలుగుమాసపత్రిక
వీధినెం. 4, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ – 500 029.

ప్రతులకు
సాహిత్యనికేతన్
3-4-852, కేశవనిలయం,
బర్కత్‌పురా, హైదరాబాద్ - 29.
వెల: రూ.300లు

దొడ్డిదారిన అధికారంలోకి వచ్చిన తిరుగుబాటు తెలుగుదేశం ప్రభుత్వం ప్రజా వంచనకు పాల్పడింది. అధికారంలో ఉన్నప్పుడు ఒక రకంగా, ప్రతిపక్షంలో ఉన్నప్పుడు మరో రకంగా వ్యవహరించటం ఈ ముఖ్యమంత్రి ప్రత్యేక లక్షణం. ఎన్నికల సమయంలో ఒక రకంగా, ఎన్నికలయ్యాక మరో రకంగా మాట్లాడటం ఆయన నైజం. ఈ ప్రభుత్వ నమ్మకద్రోహాన్ని, వైఫల్యాలను ప్రజాకోర్టులో బిజెపి ఛార్జిషీట్ చేసింది. ఆ నూరుతప్పుల అరోపణ పత్రాన్నే 1998 జనవరి సంచికగా విడుదల చేస్తున్నాం.

– సంపాదకుడు

# తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల సంకర, వంకర విధానాలు

*ఢిల్లీలో కాంగ్రెస్‌తో వియ్యం హైదరాబాద్‌లో కయ్యం*

*ఢిల్లీలో కో-ఆపరేషన్ - హైదరాబాద్‌లో ఆపరేషన్*

*ఢిల్లీలో కలిసికాపురం - హైదరాబాద్‌లో ముసుగడ్డై ఒకరిపై ఒకరు పోరాటం*

*ఢిల్లీలో ప్రేమ.... గల్లీలో డ్రామా - ఇదే హైటెక్ రామరామ*

*మరి కాంగ్రెసో?*

*వారు తక్కువ తిన్నారా?*

*'ఢిల్లీలో చంద్రబాబుకు, తెలుగు దేశానికి - జై*

*హైదరాబాదులో - నై*

*దేనికైనా - సై*

*అదే కాంగ్రెస్ - ఐ'*

ఆశ్చర్యపోకండి - ఇది హైటెక్ యుగం Secularism ను కాపాడాలంటే ఇలాంటి Peculiar విధానాలు తప్పవు.

- ఆల్మట్టి గేట్‌లు హైట్ పెంచేస్తున్నారండి అంటే - ఫరవాలేదు మనం 'బిల్‌గేట్స్'తో మాట్లాడుతున్నాం అంటారు.
- పవర్‌కట్‌తో ప్రజలు బాధపడుతున్నారండి అంటే - ఫరవాలేదు మనం ఢిల్లీలో పవర్‌ఫుల్ అయిపోయాం అంటారు.
- ఎన్నికల ముందు కాంగ్రెస్ వారిని జైళ్ళకు పంపడమెలా?
- ఎన్నికల అనంతరం కాంగ్రెస్ వారికి బెయిల్ సంపాదించడ మెలా?

*ఇది జరిగిన కథ.*

- ఎన్నికలొచ్చాయి. ఇప్పుడు రూటు మారింది. కాంగ్రెస్ వ్యతిరేకతతో ప్రజల ముందుకు వస్తున్నారు. ఎన్నికలు అయిన తరువాత మరల ప్లేటు మార్చి కాంగ్రెస్‌తో చేతులు కలపరనే నమ్మకం ఏమిటి?

# నమ్మకద్రోహుల నగ్నస్వరూపం

రాష్ట్రంలో దొడ్డిదారిన అధికారంలోకి వచ్చిన తిరుగుబాటు తెలుగుదేశం నమ్మకద్రోహానికి పాల్పడింది. ప్రజలను వంచించి, అన్ని రంగాల్లో వైఫల్యం చెందింది. కోట్లాది రూపాయలు కుమ్మరించి తన వైఫల్యాలను కప్పి పుచ్చుకు నేందుకు, ప్రజల దృష్టి మరల్చేందుకు, ఏమి చేయకపోయినా చేస్తున్నట్టుగా ప్రజలను భ్రమింపచేసేందుకు చంద్రబాబు ప్రభుత్వం ప్రచార పటాటోపంతో, వంచనా నైపుణ్యంతో నానాపాట్లు పడుతున్నది. హైటెక్ ప్రచారం - లోటెక్ పనితీరు ఈ ప్రభుత్వం మారుపేరుగా నిలిచిపోయింది. 'ప్రచారంలో ఫస్ట్ - పనితీరులో లాస్ట్' దీని హైలైట్. పేర్లు మార్చి కొత్త కార్యక్రమాల పేరిట ఆర్భాట ప్రకటన, బడ్జెట్ నిధులు మళ్ళింపు. ఆకస్మిక తనిఖీలు, దూరదర్శన్, రేడియోాలలో ముఖాముఖి, పత్రికల్లో ఫుల్‌పేజి ప్రకటనలు, వైఫల్యాలను కప్పిపుచ్చుకు నేందుకు నెలకొక కొత్త కార్యక్రమాన్ని ప్రకటించడం, ఆర్భాటంగా ప్రారంభించడం, హెచ్చు స్థాయిలో ప్రచారం చేయడం, ప్రజలలో ఆశలు కల్పించడం, ఈలోగా మరొక కార్యక్రమానికి రూపకల్పన, వైఫల్యాలతో మరొక కార్యక్రమం వైపు దృష్టి మళ్ళించడం, పని చేసేందుకు లేకపోతే ఆకస్మిక తనిఖీల ద్వారా ప్రచారం, కార్యక్రమాల వైఫల్యానికి అధికారులపై ఆగ్రహం ప్రకటించడం, హెలికాప్టర్‌లో విస్తృతంగా పర్యటించడం, ఇక్కడ వార్తలకు అవకాశం లేకపోతే ఢిల్లీ వెళ్ళి జాతీయ రాజకీయాలలో సంచలన ప్రకటనలు చేయడం, ఏమి చేయకపోయినా, చేస్తున్నట్టుగా ప్రజా సమస్యలపై ఆరాట పడు తున్నట్టుగా నటించడం ఈ ప్రభుత్వ విధానం అయిపోయింది.

వైఫల్యాలను ప్రజలు అర్థం చేసుకోవచ్చు. కాని నమ్మక ద్రోహాన్ని క్షమించలేరు. ఈరోజు రాష్ట్ర ప్రభుత్వం నమ్మక ద్రోహానికి మారుపేరుగా తయారయింది. విశ్వసనీయతను కోల్పోయింది. ఈ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తీరే అనైతికం. ప్రజలు ఈ ముఖ్యమంత్రికి పట్టం కట్టలేదు. రాష్ట్రంలో అవినీతి, అసమర్థ కాంగ్రెసును పునాదులతో కదిలించిన శ్రీ రామారావు నాయకత్వానికి ప్రజలు ఓటు వేశారు. 294

స్థానాలకు గాను 220 స్థానాలలో గెలిపించారు. శ్రీ రామారావు కార్యదీక్షత, కాంగ్రెసు వ్యతిరేకత, పేద ప్రజల సంక్షేమం, రైతులకు చేయూత, బలహీన వర్గాలకు ప్రాధాన్యం, ప్రజలను ఆకట్టుకున్నాయి. విచిత్రమైన పరిస్థితులలో ఒక పథకం ప్రకారం హైటెక్ తెలివితో పార్టీని హైజాక్ చేసి అధికారాన్ని చేజిక్కించుకున్న తిరుగుబాటు తెలుగుదేశం వాదులు, తమ మాజీ కాంగ్రెసు తెలివితేటలు ఉపయోగించి ప్రజలను మభ్య పెట్టారు. తెలుగుదేశం కాంగ్రెస్ వ్యతిరేకతతో పుట్టింది. శ్రీ రామారావు కాంగ్రెసుతో రాజీలేని పోరాటాన్ని సాగించారు. దేశంలో ఉన్న అన్ని కాంగ్రేసేతర పార్టీలను ఒక వేదికపైకి తెచ్చేందుకు అలుపెరుగని ప్రయత్నాలు చేసారు. అందుకే కాంగ్రెసు వారు అక్రమ మార్గాలలో ఫిరాయింపు లను ప్రోత్సహించి, రాజ్యాంగాన్ని వమ్ముచేసి గవర్నర్ రామ్ లాల్‌ను ఉపయోగించి, వెన్నుపోటుదార్లను ప్రోత్సహించి ప్రజా స్వామ్యాన్ని హత్యచేశారు. శ్రీ రామారావును గద్దె దించారు. కాంగ్రెస కుతంత్రంపై తెలుగు ప్రజలు పెల్లుబికిన ఆగ్రహావేశాలతో ఉద్యమించి, కుట్రదారులకు బుద్ధిచెప్పి కాంగ్రెస మెడలు వంచి ప్రజాస్వామ్యాన్ని పునఃప్రతిష్టించారు. ఆ ఉద్యమంలో తెలుగు దేశానికి వెన్నుదన్నుగా అందరికన్నా మిన్నగా ముందుండి బిజెపి ప్రజాస్వామ్య పరిరక్షణ ఉద్యమంలో గణనీయమైన పాత్రను నిర్వర్తించింది. అడుగడుగునా కాంగ్రెస కుట్రను తిప్పికొట్టింది. ఆఖరుకు శాసనసభ్యులున్న రామకృష్ణ స్టూడియోకు కాపలా కూడ కాసింది. ఇది చరిత్ర. తిరుగుబాటు తెలుగుదేశంలో వాదులు కాంగ్రెస్‌తో చేతులు కలిపి తమ రాజకీయ, నీతి బాహ్య విధానా లను చాటిచెప్పి, చరిత్రను మరిపించాలని ప్రచారాలు చేసినా విజ్ఞులైన ప్రజలు చరిత్రను విస్మరించరు. తెలుగుదేశం నిజమైన తెలుగుదేశం కార్యకర్తకు, ఆఖరుకు సానుభూతిపరులకు కూడ 1984 ఆగస్టు సంక్షోభంలో కాంగ్రెస దుష్టపాత్ర - బిజెపి ప్రజాస్వామ్య పరిరక్షణ పాత్ర మరపురాదు. మరువలేరు. కాని ఆ రామారావును తొలగించి అధికారంలోకి వచ్చిన హైటెక్ బృందం ఆ విధానాలకు, సిద్ధాంతాలకు పూర్తిగా తిలోదకాలు ఇచ్చింది. సిగ్గువిడిచి, బరితెగించి కాంగ్రెస్‌తో చేతులు కలిపింది. అవినీతిపై పోరాటమే తమ ధ్యేయమని ప్రచారం చేసుకున్న తెలుగుదేశం కేంద్రంలో కాంగ్రెసుతో చేతులు కలిపి భాగస్వాము లుగా ప్రభుత్వంలో చేరింది. దేశ రక్షణను సైతం తాకట్టుపెట్టి ఆయుధాల కొనుగోలులో ముడుపులు బొక్కిన బోఫోర్స్ బాగోతంపై తమతో పాటు కాంగ్రెసేతర సభ్యులను పార్లమెంటు నుంచి రాజీనామా చేయించిన తెలుగుదేశం అదే కాంగ్రెస్‌తో లక్షల కోట్ల కుంభకోణాల్లో దోషులుగా ఉన్న

కాంగ్రెస్ నాయకులతో అధికారం కొరకు చేతులు కలపడం ఎంత నీతిబాహ్యమో అందరికీ తెలుసు. 65 కోట్ల కుంభకోణానికే అందరిచేతా రాజీనామా చేయిస్తే ఇటీవల వెలుగులోకి వచ్చిన లక్ష కోట్ల కుంభకోణాలలో దోషులుగా వున్న పార్టీతో కలిసి కో-ఆర్డినేషన్ కమిటీకి అంగీకరించిన నాడే ఈ నకిలీ తెలుగుదేశం అసలు స్వరూపం బట్టబయలైంది. దీని విశ్వసనీయతపై, చిత్తశుద్ధిపై అనుమానాలు మొదలయ్యాయి. కాంగ్రెసు వారికి జైలుకు పోకుండా రక్షణ కావాలి. తెలుగుదేశం వారికి కేంద్రంలో పదవులు కావాలి. రాజీకి ఇదే ప్రథమ సూత్రం.

రాష్ట్ర ప్రయోజనాలను కాపాడడంలో ఈ ప్రభుత్వం పూర్తిగా విఫలమయ్యింది. పెండింగ్ ప్రాజెక్టుల మాటే లేదు. రాష్ట్ర ప్రజల అన్యాయానికి కారణమైన ఆల్మట్టి, ఎగువ తుంగలపై రాష్ట్ర ప్రభుత్వ వైఫల్యం క్షమించరానిది. కింగ్ మేకర్లమని చెపుతున్నప్పటికి ప్రజల మౌలిక హక్కులను కాపాడడంలో విఫలమయ్యారు. శాంతి భద్రతలు పూర్తిగా క్షీణించాయి. తీవ్రవాదం పెచ్చుపెరిగి తెలంగాణాలో పోటీ రాజ్యం నెలకొన్నది. దోపిడీలు, దొంగతనాలు, హత్యలు, మానభంగాలకు హద్దే లేదు. కె.జి నుండి పి.జి వరకు పరీక్షా పత్రాల లీకేజీ, పరిశ్రమల మూసివేత, అమ్మకం, ప్రజలపై పన్నుల భారం, ప్రపంచ బ్యాంకు చెప్పినట్టుగా నడుచుకోవడం ఈ ప్రభుత్వం యొక్క విధానం అయిపోయింది. రైతులకు గిట్టుబాటు ధర లేదు. కరెంటు కోత భయంకరంగా వున్నది. అక్రమ మద్యం అధికార పార్టీ వారికి వరమైపోయింది. అభివృద్ధి కుంటుపడింది. పేద ప్రజలపై భారం ఎక్కువ అయింది. రికార్డు స్థాయిలో పన్నులు విధించినా కనీస వస్తువులకు దిక్కు లేదు. అవినీతి విచ్చలవిడి అయిపోయింది. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఘోరంగా తయారయ్యింది. ప్రజా సమస్యలను పట్టించుకునే నాధుడే లేడు. జిమ్మిక్కులతో పరిపాలన చేయాలనుకోవడంతో క్రింది స్థాయి ప్రజల సమస్యలను గాలికి వదిలివేశారు. సర్వత్రా వైఫల్యానికి సంబరాలు ఎందుకని ప్రజలు ప్రశ్నిస్తుంటే ప్రభుత్వం తన హైటెక్ తెలివితో తనకు అనుకూలంగా ఉన్న వంది మాగధ ప్రచార సాధనాల సౌజన్యంతో ప్రజల దృష్టి మళ్ళించడమే ఏకసూత్ర కార్యక్రమంగా పెట్టుకుని నడుస్తున్నది.

దీనికి తోడు శ్రీ రామారావు ప్రారంభించిన సంక్షేమ పథకాలను వదిలేదు లేదని, పేద ప్రజలే దేవుళ్ళు, వారి సంక్షేమమే మా ధ్యేయమని ఎన్నికలలో ప్రమాణం

చేసి చెప్పిన ముఖ్యమంత్రే ఎన్నికలు కాగానే ఆ పథకాలకు వరుసగా తూట్లు పొడుస్తున్నారు. చెప్పిన దానికి విరుద్ధంగా వ్యవహరించడమే తమ విధానంగా వ్యవహరిస్తున్నారు. వాగ్దాన విరుద్ధంగా వ్యవహరించి నమ్మక ద్రోహానికి పాల్పడ్డారు. అన్నదాతల ఆత్మహత్యకు కారకులయ్యారు. అన్నదాతలపై కాల్పులు జరిపారు. కాంగ్రెసు దుష్ట సంస్కృతిని రూపుమాపేందుకు నెలకొల్పబడిన తెలుగుదేశంను కాంగ్రెసుకు ప్రతి రూపంగా తయారు చేశారు. అందుకే ఈ ప్రభుత్వంపై అన్ని వర్గాల అసంతృప్తి పెరుగు తున్నది. దీని నిజ స్వరూపాన్ని బట్టబయలు చేసేందుకు, ప్రజలలో ఆరోగ్యకరమైన రాజకీయ చర్చను లేవనెత్తేందుకు, ఒక నిర్మాణాత్మకమైన ప్రతిపక్షంగా భారతీయ జనతాపార్టీ ఈ ప్రభుత్వం యొక్క నమ్మక ద్రోహాన్ని, వైఫల్యాలను వీరు చెప్పినదేమిటి, చేస్తున్నదేమిటి సవివరంగా ప్రజల ముందు పెట్టదలచుకుంది. 1983లో ప్రజలచే తిరస్కరించబడ్డ కాంగ్రెసు అప్రజాస్వామిక రీతిలో అవకాశవాద అతి తెలివిగాళ్ళను ఉపయోగించి శ్రీ ఎన్.టి.ఆర్‌ను వెన్నుపోటు పొడిచి ప్రభుత్వాన్ని హైజాక్ చేసిన సందర్భంగా భారతీయ జనతాపార్టి ఆగస్టు సంక్షోభంలో ప్రజాస్వామ్య పరిరక్షణకు తనవంతు కర్తవ్యం నిర్వహించింది. అగ్రభాగాన ఉండి అన్యాయాన్ని ఎదురించింది. ఈ రోజు మరొక ఆగస్టు సంక్షోభంలో అధికారాన్ని చేజిక్కించు కుని, కాంగ్రెసుతో చేతులు కలిపి నమ్మక ద్రోహానికి పాల్పడి ప్రజలను వంచిస్తున్న పాలకుల నగ్న స్వరూపాన్ని ప్రజలు ముందుపెట్టాలని భారతీయ జనతాపార్టీ ఈ చార్జిషీటును తీసుకు వస్తున్నది. ఆనాడు రాష్ట్ర స్థాయిలో కాంగ్రెసు రాజ్యాంగాన్ని ఖూనీ చేసింది. ఈ రోజు ఎన్నికలలో ప్రజల చేత నిరాకరించబడినా, దొడ్డిదారిన కేంద్రాన్ని రిమోట్ కంట్రోల్ ద్వారా శాసిస్తున్నది. అందువలన దీనికి బాధ్యులైన వారి అసలు స్వరూపాన్ని కూడా తెలుసుకోవడం అవసరం.

రాష్ట్రంలో అధికారంలో వున్న తెలుగుదేశం తన ఎన్నికల ప్రణాళికలో ఏ వాగ్దానాలు చేసింది- ఏ విధంగా నమ్మక ద్రోహానికి పాల్పడి, వాగ్దాన భంగం చేసింది సవివరంగా తెలియజేసేందుకు భారతీయ జనతాపార్టీ ఈ చార్జిషీటును మీ ముందుంచుతున్నది.

## 1. అవినీతి కాంగ్రెస్‌తో మిలాఖత్:

చంద్రబాబు నాయకత్వంలోని తిరుగుబాటు తెలుగు దేశం 1996 ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెస్‌ను గురించి ఇలా వివరించింది.

### చెప్పిందేమిటి?

'కాంగ్రెస్ ప్రభుత్వాల దగాకోరు, తప్పుడు విధానాల వల్ల ప్రజల నమ్మకాన్ని పోగొట్టుకుంది. లంచగొండితనం కాంగ్రెస్ నాయకులకు జీవన విధానంగా మారింది. కుంభకోణాలు, కుతంత్రాలు వారికి అలవాటు. బడా వ్యాపారులతో కుమ్మక్కై- ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేశారు. మత కల్లోలాలు, ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొట్టే వారితో కలసి విద్రోహ చర్యలను ప్రోత్సహించే కాంగ్రెస్‌ను ఓడించాలి'.

### చేస్తున్నదేమిటి?

1996 ఎన్నికల అనంతరం అదే దగాకోరు, అవినీతి, విద్రోహక చర్యలను ప్రోత్సహించే కాంగ్రెస్‌తో తెలుగుదేశం చేతులు కలిపింది. మాటలు మార్చడంలో మన ముఖ్యమంత్రి బహునేర్పరి. ఎన్నికల సమయంలో కాంగ్రెసు వారికి సరైన స్థలం తీహార్ జైలు అని చెప్పి, ఇప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడు సీతారాం కేసరితో చెట్టాపట్టాలు వేసుకుని తిరుగుతున్నారు.

## 2. రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం:

### ఎన్నికల ప్రణాళికలో చెప్పిందేమిటి?

'రెండు రూపాయల కిలో బియ్యం పథకం అమలుకు తెలుగుదేశం ప్రభుత్వం గట్టి పట్టుదలతో దీక్ష వహించి ఉంది. దేశమంతటా 2/- రూపాయలకు కిలో బియ్యం

పథకాన్ని వర్తింపచేయడం జరుగుతుంది. సామాజిక న్యాయం, బలహీన వర్గాలు దుస్థితిని తొలగించడమే ఈ 2/- రూపాయల కిలో బియ్యం పథకం ముఖ్య ఉద్దేశం.'

### చేస్తున్నదేమిటి?

'రెండు రూపాయలకు కిలో బియ్యం - అన్నవరం - ఎట్టి పరిస్థితులలో సంక్షేమ కార్యక్రమాలను విడనాడేది లేదు' - అని చెప్పిన తెలుగుదేశం నాయకులు శ్రీ రామారావు ఆశయ సాధనే ధ్యేయమని చెప్పి, ఎన్నికలు కాగానే సబ్సిడీ బియ్యం ధరను రూ. 3.50 పైగా పెంచివేశారు. అంతకు మునుపు కాంగ్రెసు ఆ పని చేస్తే ఈ నాయకులే కాంగ్రెస్‌ను పేదల వ్యతిరేకి అని నిప్పులు కురిపించారు.

పేదవాడు అర్థాకలితో మాడకుండా చూడటమే మా లక్ష్యమని చెప్పి సబ్సిడీ బియ్యాన్ని 25 కిలోల నుండి 16 కిలోలకు తగ్గించారు.

తెలుగుదేశం గెలిస్తే దేశ వ్యాప్తంగా రూ. 2/-లకే కిలో బియ్యాన్ని అందరికీ అందిస్తామని పేర్కొని, ఎన్నికల అనంతరం స్వంత రాష్ట్రంలోనే ఆ పథకానికి తూట్లు పొడిచారు.

18-11-95న ఇంటి వద్దకే సబ్సిడీ బియ్యం అందచేస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఇంటి సంగతి దేవుడెరుక - రేటు పెంచి కోటాలో కోత విధించారు.

★ బియ్యం, విద్యుత్, మద్య నిషేధం వల్ల 4,000 కోట్ల రూపాయలు రాష్ట్రానికి లోటు. అయినా ఈ సంక్షేమ కార్యక్రమాలే ఎప్పటికి కొనసాగుతాయి. పేదవారే నా దేవుళ్ళు. ప్రతిపక్షం గెలిస్తే కిలో బియ్యం 5 రూపాయలు అవుతుంది. మేము గెలిస్తే 2 రూపాయలు మాత్రమే అని ఎన్నికల సభల్లో ముఖ్యమంత్రి రెండు వేళ్ళు ప్రతి చోటా చూపించారు (24-4-96)

★ 25-6-96న సబ్సిడీ బియ్యం ధర, నీటితీరువా, వ్యవసాయ కరెంటు ఛార్జీలు, టర్నోవర్ టాక్స్, ఎంట్రీ టాక్స్, వృత్తి పన్ను, ఆర్.టి.సి ఛార్జీలు పెంచారు.

సబ్సిడీ బియ్యం రేటు పెంపు - బియ్యం కోటాలోకోత వలన ప్రభుత్వానికి భారం తగ్గింది. పన్నుల పెంపువలన ఆదాయం ఎక్కువైంది. మరి ఆ డబ్బును ఏం చేశారో ప్రభుత్వం చెప్పదు.

## ౩. మద్యపానంపై మహాద్రోహం:

*ఎన్నికల ప్రణాళికలో చెప్పిందేమిటి?*

'సంపూర్ణ మద్యపాన నిషేధం మా లక్ష్యం - రాజకీయ దృఢ సంకల్పమే వజ్రాయుధంగా సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని అమలు చేస్తామని, నిషేధాన్ని అమలు చేయడం మహాత్మాగాంధి పవిత్ర స్మృతికి ఘన నివాళి అని తెలుగుదేశం నమ్ముతుంది'.

*మా ప్రతిజ్ఞ:*

''మా మేనిఫెస్టోలో పేర్కొన్న అన్ని పథకాలను, ప్రణాళి కలను తూ.చ తప్పకుండా పాటిస్తామని, అమలు జరుపుతామని వాగ్దానం చేస్తున్నాం.''

*చేసిందేమిటి?*

రాష్ట్రంలో శ్రీ రామారావు సంపూర్ణ మద్య నిషేధాన్ని ప్రవేశపెట్టారు. ఆ తరువాత అధికారం చేజిక్కించుకున్న చంద్రబాబు ప్రభుత్వం, ఇంతకన్నా మాకు చిత్తశుద్ధి ఎక్కువని చెప్పేందుకు ఆరోగ్య కారణాలపై ఇచ్చే పర్మిట్లను కూడా రద్దు చేశారు. కోట్లు ఖర్చు పెట్టి ప్రచారం చేపట్టారు. 1-9-95న అసెంబ్లీలో ఏకగ్రీవ తీర్మానం చేసి దేశ వ్యాప్తంగా మద్య నిషేధం అమలు చేయాలని, కేంద్రంలో అధికారంలోకి వచ్చిన తరువాత ఆ విషయాన్ని స్టీరింగ్ కమిటీతో చర్చించకపోగా, రాష్ట్రంలో నిషేధాన్ని నీరుగార్చి, అది విఫలమయ్యేలా చేసి, అధికార పార్టీ వారే అక్రమ వ్యాపారానికి పాల్పడి, సాక్షాత్తు మంత్రులు, ఎం.ఎల్.ఎ.లే వ్యాపారాన్ని కొనసాగిస్తున్నారనే ఆరోపణలు ఎదుర్కొని, ఆఖరుకి నిషేధాన్ని తొలగించి నమ్మక ద్రోహానికి పాల్పడ్డారు. నిషేధం పెట్టినందువలన రాష్ట్ర ఆదాయానికి భారీగా నష్టం వాటిల్లిందని చెప్పి ప్రజలపై భారీగా 2,658 కోట్ల రూపాయల పన్నులు విధించారు. నిషేధాన్ని ఎత్తివేసే సమస్యే లేదని పదే పదే ప్రకటనలు గుప్పించారు. ఎన్నికలయిన తరువాత నిషేధాన్ని నీరుగార్చారు.

*.. ఇంతకన్నా నమ్మకద్రోహం ఇంకొకటి ఉంటుందా? వీరికి ఏ శిక్ష విధించాలో మీరే ఆలోచించండి.*

రాష్ట్రంలో అన్ని చోట్ల మద్యం ఉత్పత్తి అవుతున్నది. రాష్ట్ర వ్యాప్తంగా అమ్మకంలో వుంది. సెకండ్స్ దొరుకుతున్నాయి. ఈ వ్యాపారంలో తెలుగుదేశం

నాయకులే పట్టుబడ్డారు. మాఫియా గ్యాంగుల తొలగింపుకే నిషేధాన్ని ఎత్తివేస్తున్నామని, మద్య నిషేధం అమలులో విఫలం చెందామని అంగీకరిస్తూనే సారాయి నిషేధాన్ని అమలు చేస్తామని చెప్పారు. ఇప్పుడు అధికార పార్టీవారే మాఫియాలుగా మారి అక్రమ మద్యం వ్యాపారాన్ని ప్రోత్సహిస్తున్నారని అందరికీ తెలుసు. నంద్యాల ఎం.పి ప్రోత్సాహంతో అక్రమ మద్యం రవాణా అవుతుంటే పట్టుకుని కేసు పెట్టిన ఎస్.ఐ.ను తొలగించారు. నిజాయితీపరుడైన ఎస్.పి.ని 45 రోజులకే బదిలీ చేశారు. మహాత్ముని సాక్షిగా, ఆయన స్ఫూర్తితో నిషేధాన్ని అమలుచేస్తామని ప్రకటించిన ముఖ్యమంత్రి ఆచరణలో ఎలా వ్యవహరిస్తున్నా రన్నదానికి ఇదొక మచ్చుతునక.

నిషేధం పేరుతో పన్నులు విధించి, దాన్ని ఎత్తివేసిన తరువాత పన్నులు ఉపసంహరించమంటే - *గోడకు కొట్టిన సున్నం* - *ప్రభుత్వానికి కట్టిన పన్ను వెనక్కి రాదు* అంటు న్నారు.

### 4. పంటకు - ఇంటికి విద్యుత్ చార్జీల భారీ వడ్డన

ఎన్నికలకు ముందు రూ. 50 లకే హార్స్‌పవర్ విద్యుత్‌ను రైతులకు అందచేస్తుంటే, దానిని కొనసాగిస్తామని చెప్పి దానిని రూ. 250/-కి పెంచేశారు. రైతులే ట్రాన్స్‌ఫార్మర్లు కొనుక్కునే పద్ధతి ప్రవేశపెట్టారు. కొత్త కనెక్షన్లకు ఒక స్తంభం కన్నా ఎక్కువ వుంటే అవకాశం లేదంటున్నారు.

గృహావసరాలకు వాడే విద్యుత్ యూనిట్ చార్జీలను భారీగా పెంచారు. స్లాబ్ రేట్లలో మార్పు చేసి మోయరాని భారాన్ని ధనిక, పేద తేడా లేకుండా అందరిపైన మోపారు.

### 5. అర్హులందరికీ రేషన్ కార్డులు:

అర్హులందరికీ కార్డులిస్తామని, కొత్తగా 10 లక్షల తెల్ల కార్డులు పంపిణీ చేస్తామని 9-12-95న ముఖ్యమంత్రి ప్రకటించారు. ప్రపంచ బ్యాంకు సలహాపై ఇప్పుడు ఉన్న కార్డులు ఊడగొడుతున్నారు.

పట్టణ వాసులకు రూ. 6.50లకే బియ్యం - ముఖ్య మంత్రి. ప్రకటనలకే **పరిమితం - ఆచరణలో శూన్యం**

## 6. గృహ నిర్మాణంలో పక్షపాతం - నమ్మకద్రోహం

*చెప్పిందేమిటి?*

మూడేళ్ళలో పేదల కోసం 21 లక్షల ఇళ్ళు నిర్మిస్తాం - ముఖ్యమంత్రి

బలహీన వర్గాలకు గృహ నిర్మాణంలో కొత్త రికార్డు సాధిస్తాం - ముఖ్యమంత్రి (24.8.96)

*చేస్తుందేమిటి?*

బలహీన వర్గాలకు గృహ నిర్మాణం పథకం క్రింద సంవత్సరానికి 5 లక్షల గృహాల నిర్మాణం, ఎన్.టి.ఆర్ హయాంలో జరుగుతుంటే ప్రస్తుతం దానిని 3 లక్షలకు కుదించినా, ఆచరణలో కనీసం లక్ష ఇళ్ళను కూడా పూర్తి చేయలేకపోయారు.

ఇళ్ళ కేటాయింపులను రాజకీయం చేశారు. కేటాయింపు అవినీతిమయమై, అక్రమాల ఫిర్యాదులు కోకొల్లలుగా వస్తు న్నాయి. **ఎవరేమనుకున్నా, పత్రికలలో ఎన్ని వార్తలొస్తున్నా తమ ప్రభుత్వ హయాంలో తెలుగుదేశం కార్యకర్తలకే ఇళ్ళను పంపిణీ చేస్తామని, ఇతర పార్టీల వారెవ్వరికి నియోజక వర్గ బలహీన వర్గాల గృహాలను కేటాయించే ప్రశ్నే లేదని గనులు, భూగర్భ వనరుల శాఖ మంత్రి ఎ.చంద్రశేఖర్ ప్రకటించడం గమనార్హం.** (ఈనాడు 11.10.1997)

## 7. చీకటి రాజ్యం

- ★ గృహ అవసరాలకు విద్యుత్ కోత ఉండదు - ఎన్నికల సభలో ముఖ్యమంత్రి (10.4.95.)
- ★ రాష్ట్రంలో రెండు సంవత్సరాలలో కరెంట్ కోత లేకుండా చేస్తాం - ముఖ్యమంత్రి (11.9.95)
- ★ వచ్చే ఏడాది (96) డిసెంబరు కల్లా 2000 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి చేస్తాం. - ముఖ్యమంత్రి (24.11.95)
- ★ కరెంటు కోత ఎక్కువుంటే నాకు ఫోన్ చేయండి. - ముఖ్యమంత్రి (12.12.95)

ఎన్నికల ముందు ప్రతిపక్షంలో ఉండగా రోజుకు 18 గంటలు కరెంటు ఇవ్వాలని

ఆందోళన చేశారు. రెండేళ్ళలో కరెంటు కోత లేకుండా చేస్తామని అన్నారు. కరెంటు కోత ఎక్కువైతే కార్డు ముక్క రాయమన్నారు. రైతులకు పట్టుమని 9 గంటలు కూడా కరెంటు లేదు. కరెంటు కోతతో అనేక పరి శ్రమలు మూతపడ్డాయి. కార్మికులు వీధిన పడ్డారు. పట్టణాల్లో ప్రజలు చీకటి రాజ్యంలో జీవిస్తున్నారు. 'రామారావు ప్రభుత్వం హయాంలో అప్పుడప్పుడు కరెంటు పోతుంటే, ఈ ప్రభుత్వ హయాంలో అప్పుడప్పుడు కరెంటు వస్తుందని నానుడి' అయిపోయింది. నగరాలలో, గ్రామాలలో (వర్షాకాలంలోను, ఎండాకాలంలోను) కనివినీ ఎరుగని కోతతో పరీక్షలకు వెళ్ళే విద్యార్థులు, కార్మికులు అందరూ వెతలపాలే.

## 8. మాటల్లో మంచినీరు

2000 సంవత్సరాల నాటికి జంటనగరాలకు కృష్ణా జలాలను తరలిస్తాం ముఖ్యమంత్రి (11.9.95)

★ *ఇప్పటికీ పనే మొదలు కాలేదు. బడ్జెట్‌లో సరిపడా నిధుల కేటాయింపు లేదు. ఈనాటికీ జంటనగరాలకు రోజు మార్చి రోజు నీటి సరఫరా.*

## 9. ధరల అదుపుపై రాష్ట్రస్థాయి కమిటీ

ధరల అదుపుపై రాష్ట్ర స్థాయి కమిటీ ఏర్పాటు చేస్తానని సి.ఎం. ప్రకటించారు. (23-9-95).

వివిధ వస్తువులపై అమ్మకం పన్ను పెంచి టర్నోవరు టాక్స్ విధించి, బస్సు చార్జీలు పెంచి, డీజిల్ పెట్రోల్ ధరలు పెంచి, పాలధర పెంచి, ప్రజలపై మోయలేని భారం మోపారు.

## 10. పెండింగ్ ఫైళ్ళ ప్రహసనం:

24 గంటలకు మించి ముఖ్యమంత్రి, మంత్రులు, అధి కారులు, ఉద్యోగులు ఎవరి దగ్గర కూడా ఏ ఫైలు వుండరాదు. నేను నిద్రపోను, మిమ్మల్ని నిద్రపోనివ్వను - ముఖ్యమంత్రి (9.9.1995) సచివాలయ ఉద్యోగుల నుద్దేశించి ప్రసంగిస్తూ.

★ సరిగ్గా 24 నెలల అనంతరం ఈ వాగ్దానం గుర్తుకొచ్చింది. 40 లక్షల ఫైళ్ళు పెండింగ్‌లో వున్నాయని, దీనికోసం ఒక వినూత్న కార్యక్రమాన్ని రూపొందించి, వారం రోజుల్లో పరిష్కరిస్తామని సచివాలయం నుండి మండల ఆఫీసు వరకు అన్ని ఆఫీసుల తలుపులు వారం రోజులు మూసివేశారు. ప్రభుత్వ ఘోర వైఫల్యానికి ఇదొక మచ్చుతునక. ఫైళ్ళు బదిలీ చేయడం, పైలధికారి క్రింది అధికారికి, క్రింది అధికారి పైఅధికారికి ఫైళ్ళు బదిలీ చేయించడం, ప్రజల నుండి వచ్చిన విజ్ఞప్తులను చెత్తబుట్టలో నెట్టివేసేసి సంఖ్య తగ్గించుకోవడం, ఇంతచేసి 40 శాతం పరిష్కరించామని చెప్పడం, దీనికొక ప్రచారం, పత్రికల్లో పతాక శీర్షికలతో ప్రజల దృష్టి మళ్ళించడం. హైటెక్ పాలనలో భాగమే. పాల్వంచలో కె.టి.పి.యస్. సకాలంలో బిల్లులు చెల్లించనందున కాంట్రాక్టర్ భార్య ఆత్మహత్య చేసుకుంది. ముఖ్యమంత్రి గారికి సుదీర్ఘ లేక కూడా వ్రాసింది.

# అన్ని వర్గాలకూ మొండి చెయ్యే

## 11. ఓట్లకు ముందు కోట్లే కోట్లు - ఓట్ల తరువాత తూట్లే తూట్లు:

వెనుకబడిన తరగతుల వృత్తి పనుల వారికి 147.5 కోట్లు - సి.ఎం (7-3-96)
యువజన సంక్షేమానికి 150 కోట్లు - సి.ఎం (19.3.96)

★ ***మంజూరయ్యింది మాత్రం 41 కోట్లే - 21 వేల అర్జీలు రాగా 4,400 గ్రూపులకే నిధులు విడుదల చేసారు.***

గ్రామీణ నిరుపేదల ఉపాధికి 530 కోట్లు - 19.3.96

గిరిజనాభివృద్ధికి 185 కోట్లతో ప్రత్యేక పథకం - ముఖ్యమంత్రి (31.12.95)

★ **ఎన్నికల అనంతరం మొండిచెయ్యి చూపిస్తున్నారు.**

## 12. నిరుద్యోగులకు పంగనామాలు

ఏప్రిల్‌లోగా 50 వేల ఉద్యోగాల భర్తీ, ఉద్యోగార్థులకు ఫీజు రద్దు, ఇంటర్వ్యూలకు ఉచిత బస్ సౌకర్యం, 25 రూపాయలతో దినసరి భత్యం చెల్లింపు - ముఖ్యమంత్రి (22-2-96)

★ జిల్లాలలో యువత బసచేసేందుకు తక్కువ ఖర్చుతో వసతి - మేడ్చల్ సభలో సి.ఎం (15-4-96)

★ యువతకు నూతన సంవత్సర కానుక - నెలకు వంద రూపాయల నిరుద్యోగ భృతి (19.12.95)

★ ఖాళీ పోస్టుల భర్తీపై నిషేధం 25.7.96న ముఖ్యమంత్రి **'ఓట్ల పనయిపోయిందిగా – ఇక ఉద్యోగాలెందుకు**

★ గిరిజనులకు 900 పాఠశాలలు - మంత్రి నగేష్ (6.9.95) ఇవి అందరికీ కనబడవు.

## 13. మహిళలకూ మొండి చెయ్యే:

★ ఇళ్ళ స్థలాల పంపిణీ, ఇళ్ళ మంజూరి, భూములు, రేషన్ కార్డులు - ఇవన్నీ మహిళలకు వెంటనే కేటాయిస్తారు.

★ మహిళల కేసుల విచారణకు స్పెషల్ కోర్టులు స్థాపించ బడతాయి (ఎన్నికల ప్రణాళికలో తెలుగుదేశం)

★ పుట్టిన ప్రతి ఆడ శిశువుకి రూ. 6,000లు ఆర్థిక సహాయం. (28.4.96) ఎన్నికల సందర్భంగా ముఖ్య మంత్రి -

***టి.విలో ప్రకటనలు, జి.ఓ విడుదలయింది – నిధులు విడుదల కాలేదు.***

***తెలుగుదేశం పాలనలో స్త్రీ, పురుష భేదం లేకుండా అందరికీ మొండిచెయ్యే:***

★ రాష్ట్ర స్థాయి మహిళా కమిషన్ ఏర్పాటు ***హైటెక్ పాలన కదా – సమయం పడుతుంది (24.4.96).***

## 14. మైనారిటీలకు ఎన్నికల ముందు వరాలు – తరువాత మొండిచెయ్యే:

★ ఉర్దూ విశ్వవిద్యాలయం ఏర్పాటు, నిరక్షరాస్యత నిర్మూలన, సంక్షేమానికి బడ్జెట్‌లో 20 కోట్లు, 30 వేల ఇళ్ళు, ఇళ్ళ స్థలాలలో 10 శాతం కేటాయింపు, మసీదుల మరమ్మతులకు కోటి రూపాయలు.(20-2-96)

# అన్నీ హామీలే

## 15. కూలీలకు...

★ వ్యవసాయ కూలీలకు కోటి ఎకరాల భూమి పంచుతాం - (29-12-95)

★ నెలాఖరులోగా 35 లక్షల ఎకరాల భూమి పేదలకు పంపిణీ చేస్తాం ముఖ్యమంత్రి (14-1-96). *దీనికి జవాబు ముఖ్యమంత్రే చెప్పాలి.*

## 16. రైతులకు...

★ నెలాఖరుకల్లా పట్టాదార్ పాసు పుస్తకాలు పూర్తి - ముఖ్యమంత్రి (8-12-95) ***ఇంకా 40 శాతం మందికి ఈనాటికి అందలేదు.***

★ ట్రాన్స్‌ఫార్మర్లు, బోర్లు చెడిపోతే 24 గంటలలో రిపేరు. రిపేరు చేయకపోతే కార్డు రాయండి - సి.ఎం (22-4-96). ***24 రోజులకైనా దిక్కులేదు. కరెంటు సప్లై లేదు - కార్డుకు రిప్లై లేదు.***

## 17. పేదలకూ...

★ 19 లక్షల రేషన్ కార్డులు వారం రోజుల్లో పంపిణీ (20-2-96). ***ఎన్నికల ముందు పంపిణీ - ఆ తరువాత పెరికివేత.***

★ నిరుపేద గ్రామీణులకు సత్వర న్యాయానికి గ్రామ న్యాయాలయాలు ముఖ్యమంత్రి (9-1-96) *సత్వర మంటే దశాబ్దమా - శతాబ్దమా?*

## 18. దళితులకూ...

★ ప్రతి జిల్లాలో అంబేద్కర్ కమ్యూనిటీ సెంటర్ - సి.ఎం (11-9-95)

★ ఎస్.సి, ఎస్.టి పోస్టుల భర్తీ - (11-9-95) ***ఇప్పటికి 49 వేల ఉద్యోగాలు ఖాళీగా వున్నాయి.***

## 19. పత్రికలకూ సైతం...

పత్రికా స్వేచ్ఛను పండించి పరిపుష్టి చేస్తాం - పత్రికా రంగం ధర్మాయుధంగా ఉపకరించాలి (తెలుగుదేశం ఎన్నికల ప్రణాళికలో)

★ రాష్ట్రంలో ఈ మధ్యకాలంలో పత్రికావిలేకర్లపై దాడులు, బెదిరింపులు అధికమవుతున్నాయి.

★ వికారాబాద్‌లో విలేఖరిని కొట్టి చెప్పులు మెడలో వేసిన తెలుగుదేశం శాసన సభ్యుడిని దండించక మంత్రిని చేశారు.

*నెల రోజులలో చర్య తీసుకుంటామన్నారు – చర్య ఇదే కాబోలు.*

## వీర మల్లయ్య... బోడి మల్లయ్య...

*ఎన్నికల ముందు, పత్రికల వారు పథకాలకు నిధులెక్కడి నుంచి వస్తాయని అడిగితే* ***మనసుంటే మార్గం లేదా?*** *నిధుల కొరత సమస్యే కాదు,* ***ప్రజలపై అదనపు భారం మోపే ప్రసక్తే లేదని ముఖ్యమంత్రి ప్రకటించారు.***

★ సంక్షేమ కార్యక్రమాలకు 4,000 కోట్లు భారమవుతుంది. అయినా ప్రజలపై భారం మోపం అని ఎన్నికల ముందు ప్రకటించిన సి.ఎం - ఎన్నికలు కాగానే *విద్యుత్‌పైన, ఇరిగేషన్‌పైన రాష్ట్ర ఆదాయ వనరుల పైన శ్వేతపత్రం ప్రకటించి, రాష్ట్ర ఆర్థిక పరిస్థితి బాగాలేదు, ప్రజలే సలహాలివ్వాలి – జీతాలకు డబ్బులు లేవు – ఏం చేయాలో చెప్పండి అనడం – హైటెక్ తెలివి కాదా?*

*'ఏరు దాటక ముందు ఓడ నడిపేవాణ్ణి వీర మల్లయ్య, ఏరుదాటిన తరువాత పనయిపోగానే బోడి మల్లయ్య' అంటే ఇదే కాబోలు.*

## ౨౦. రాష్ట్ర ప్రయోజనాల పరిరక్షణలో ఘోర వైఫల్యం

మన ముఖ్యమంత్రి కింగ్ మేకర్ అని, ఢిల్లీలో ఆయనే రాజకీయ చక్రం తిప్పుతున్నారని, ఆయనకు అడ్డేలేదని, ఇద్దరు ప్రధాన మంత్రులు, రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతులను ఆయనే చేశారని, ఫ్రంట్ కన్వీనర్‌గా ఫ్రంట్ ప్రభుత్వానికి సారథి అని, 'ఆల్ పవర్‌ఫుల్ సి.ఎం అని - రాష్ట్రాభివృద్ధి కోసం ప్రధాన మంత్రి పదవిని కూడా కాదన్నారని ఆయన భజంత్రీలు ఆయన్ని ఆకాశానికి ఎత్తేస్తుంటారు - కాని రాష్ట్రానికి ఒరిగిందేమిటో ఒక్కసారి ఆలోచించండి.

ఢిల్లీలో ప్రభుత్వ ఏర్పాటులో దేశనాయకుని స్థాయికి ఎదిగానని చెప్పుకునే ముఖ్యమంత్రి, రాష్ట్ర నాయకునిగా రాష్ట్రానికి జరుగుతున్న అన్యాయాన్ని కూడా

సరిదిద్దలేక పోతున్నారు. అందుకే ఇంటగెలిచి రచ్చగెలవమన్నారు. కేంద్రంలో కాంగ్రెస్ అధికారంలో ఉన్నప్పుడు రాష్ట్రానికి న్యాయం జరగలేదు. ఇప్పుడా కేంద్రంలో ఫ్రంటు ప్రభుత్వం ఉన్నా, సారథి మనవాడైనా రాష్ట్రానికి న్యాయం జరగడంలేదు.

## పెండింగ్ ప్రాజెక్టుల్లో సైతం...

పెండింగ్ ప్రాజెక్టుల విషయమై ముఖ్యమంత్రి గారి ప్రక టనలను పరిశీలిద్దాం.

★ పెండింగ్ ప్రాజెక్టుల సాధనకు నెలకొకసారి ఢిల్లీ యాత్ర - 6-9-95 సి.ఎం.

***15 రోజులకొకసారి ఢిల్లీ వెళుతున్నా పెండింగ్‌కు ఎండింగ్ లేదు. కేవలం ఫ్రంట్ మీటింగ్‌లతో కాలక్షేపం.***

★ హంద్రీనీవా ప్రాజెక్టుకు రూ. 40 కోట్లు - సి.ఎం (11-3-96)

★ సీమకు సాగునీరు ఇచ్చాకే - మద్రాసుకు త్రాగు నీరు - మంత్రి ఎస్.వి.సుబ్బారెడ్డి (3-11-95)

★ ప్రాజెక్టు కొరకై ప్రజా మద్దతుతో కేంద్రంపై పోరు - సి.ఎం 5-3-96

★ కేంద్రంతో పోరాటానికి ప్రజలు సిద్ధం కావాలి (1.3.96)

పెండింగ్ ప్రాజెక్టులపై తెలుగుదేశం, బిజెపి, సిపిఐ, సిపిఎంలు గతంలో ఉద్యమించాయి. ఢిల్లీకి వెళ్ళి లాఠీ దెబ్బలు తిన్నాయి. ఈ పెండింగ్ ప్రాజెక్టులకు కాంగ్రెసే కారణమని, రాష్ట్రంపై అది సవతితల్లి ప్రేమ చూపించిందని విమర్శించాయి. ఇప్పుడు ఢిల్లీ చక్రం మనదే - ***మన వాడే 'కింగ్ మేకర్' ఒక్క పెండింగ్ ప్రాజెక్టు అయినా సాధించారా?***

కేంద్రం వద్ద 17 భారీ నీటి పారుదల ప్రాజెక్టులు, 10 మధ్యతరహా ప్రాజెక్టులు ఏళ్ళతరబడి పెండింగ్‌లో ఉన్నాయి. ఈ ప్రాజెక్టుల విషయమై అటు కాంగ్రెస్, ఇటు తెలుగుదేశం రెండు రాజకీయం చేస్తున్నాయి. కేంద్రంలో, రాష్ట్రంలో రెండు పార్టీలు అధికారంలో ఉన్నప్పుడు వివాదాలతో, తగాదాలతో కాలం గడిపాయి. ఇపుడు ఒకే పార్టీ అధికారంలో ఉన్నా అడిగే దిక్కు లేదు. ఏళ్ళు గడిచినా, ప్రభుత్వాలు మారినా పెండింగుకు ఎండింగ్ కనబడటంలేదు.

## ౨1. నీటిపారుదలపై నిర్లక్ష్యం

ఉపేక్షకు గురవుతున్న మధ్యతరహా, చిన్నతరహా ప్రాజెక్టు లకు గ్రామీణ మౌళిక అవసరాల అభివృద్ధి నిధి కింద నాబార్డు రుణమిస్తున్నా, నిబంధనల ప్రకారం ప్రభుత్వం 18 నెలల్లో పూర్తి చేసి ఆయకట్టుకు నీరు ఇవ్వలేక పోయింది. 95 ఏప్రిల్ నుండి ఇప్పటికి 40 ప్రాజెక్టులకు నాబార్డు రుణం ఇవ్వడానికి ముందుకు వచ్చింది. ఆర్.ఐ.డి.ఎఫ్. - 1 కింద చేపట్టిన పది ప్రాజెక్టులు ఈ ఏడాది ఆఖరుకు పూర్తి చేయాల్సి వుండగా, 98 జూన్‌నాటికి పూర్తి చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఇది నిర్లక్ష్యానికి మచ్చుతునక.

ఇప్పుడు ఆర్.ఐ.డి.ఎఫ్. - 2 కింద 60.52 కోట్ల అంచనాలతో మరొక 11 మధ్యతరహా ప్రాజెక్టులు చేపట్టగా, 97 సెప్టెంబరు నాటికి కోటి రూపాయలే ఖర్చు చేశారు. పాకాల చెరువు (వరంగల్), కోటిపల్లి వాగు, కోయిలసాగర్, దిండి, స్వర్ణ, రామడుగు, బల్లారం, లోయర్ సగిలేరు, రాళ్ళపాడు, మోపాడు వీటిల్లో కొన్నింటికి ఇంకా టెండర్లే ఖరారు కాలేదు. ఆర్.ఐ.డి.ఎఫ్. - 3 కింద నిధులు ఇవ్వాలంటే ఆర్.ఐ.డి.ఎఫ్. - 2 పూర్తి కానిదే ఇవ్వమని నాబార్డు వెనకడుగువేస్తోంది. మైనర్ ఇరిగేషన్, ఎత్తిపోతల పథకాల పరిస్థితి కూడా ఇలా వుంది. ఆర్.ఐ.డి.ఎఫ్. - 1 కింద 48 పథకాలు, ఆర్.ఐ.డి.ఎఫ్. - 2 కింద 54 పథకాలు మంజూరైతే, రాయలసీమలో 37.95 కోట్ల రూపాయలు 35 పథకాలకు మంజూరు లభించగా ఇప్పటివరకు ఒకటి కూడా పూర్తికాలేదు. ఆర్.ఐ.డి.ఎఫ్. - 2లో ఇచ్చినవి ఇంకా శాంక్షన్ కూడా పూర్తి కాలేదు.

### నిధులున్నా నిర్లక్ష్యపు శని *(ఈనాడు ప్రథంటుపేజి వార్త, 5-11-97)*

రాష్ట్ర ప్రభుత్వం ప్రస్తుత ప్రణాళికలో నీటిపారుదల ప్రాజెక్టులకు కేటాయించిన మొత్తం 810 కోట్లు భారీ ప్రాజెక్టులకు కేటాయించినవి 402 కోట్లు. మొదటి ఆరు నెలల్లో విడుదల చేసినవి మాత్రం 72 కోట్లకంటే తక్కువ. గాలేరు-నగరి, శ్రీరాంసాగర్ రెండవ దశ లాంటి ప్రతిష్ఠాత్మక ప్రాజెక్టులతో సహా మరో 10 భారీ ప్రాజెక్టులకు వార్షిక కేటాయింపులు 123 కోట్లు కాగా మొదటి ఆరు నెలల్లో 10 కోట్లయినా విడుదల చేయలేదు. మహారాష్ట్ర కృష్ణా వ్యాలీ అథారిటీ పేరుతో వేయి కోట్లు, కృష్ణాజలాల

భాగ్యనిగం పేరుతో 500 కోట్లు సేకరించగా 2000 ల సంవత్సరంలోగా కృష్ణానీటిని వీలైనంత ఎక్కువగా వాడుకుని తదుపరి హక్కుగా సాధించుకునే అవకాశమున్న మన రాష్ట్రం మాత్రం నత్తనడక నడుస్తున్నది. తెలివితక్కువగా మొదటి విడుతలో లక్షరూపాయలు పెట్టుబడి పెట్టగలిగిన శ్రీమంతులకే వర్తించే విధంగా బాండ్లు రూపొందించడంతో 60 కోట్ల సేకరణే ఆంధ్రకు గగనమైంది.

## 22. తుఫాను సహాయంలో సైతం...

*గోదావరి జిల్లాలలో **1996** తుఫాను*

రాష్ట్రానికి అదనంగా నిధులు రాబట్టే సంగతి దేవుడెరుగు - రావాల్సిన నిధులు అందాయా? 1996లో కోస్తా తుఫాను బాధితులకు కేంద్ర సహాయం నామమాత్రం 96 నవంబర్ తుఫాన్ వల్ల 6,124 కోట్లు నష్టం జరిగిందని, 50 లక్షల కొబ్బరి చెట్లు నాశనం అయ్యాయని మన 'కింగ్ మేకర్' నివేదిక ఇస్తే ఆనాటి కింగ్ (దేవెగౌడ్) దానిని శంకించారు - పార్లమెంటులో ఎత్తిపొడిచాడు. నిజాలు తేల్చమని మిత్రపక్ష నాయకులు, వ్యవసాయ శాఖ మంత్రి మిశ్రాను పంపిస్తే, ఆయన ఆంధ్రా తుఫాన్ కంటే ఒరిస్సా కరువే తీవ్రం అని చెప్పి కింగ్ మేకర్ యొక్క గాలి తీసేశారు. జాతీయ విపత్తు నిధి నుండి 125 కోట్లు ఇచ్చారు. హెలికాప్టర్‌లో తిరిగి అంతర్జాతీయ ప్రచార సాధనాల్లో విస్తృత ప్రకటనలు చేసి ఇంటర్‌నెట్‌కెక్కి, ప్రపంచ మంతా ప్రచారం చేసి విరాళాలు సేకరించినా, తుఫాన్ బాధితు లకు అందింది నామమాత్రం. కింగ్ మేకర్ రు. 2,200 కోట్లు సహాయం కోరితే పట్టుమని 10 శాతం అయినా కేంద్రం ఇవ్వక పోవడంతో తుఫాన్ బాధితుల్ని వారి కర్మకు వారినే వదిలేసింది రాష్ట్ర ప్రభుత్వం. రైతులకు మొండి చేయి చూపించింది. 96 నవంబరులో వచ్చిన తుఫానుకు ఇచ్చిన నిధులలో 142 కోట్ల రూపాయలు ప్రభుత్వం ఉద్యోగుల జీతాలకు మళ్ళించిందనే ఆరోపణ వచ్చినా సమాధానం లేదు.

### తుఫాను బాధితుల గృహ పునర్నిర్మాణంలో వైఫల్యం

తుఫాన్ బాధితులకు 49 వేల ఇళ్ళను ముఖ్యమంత్రి ప్రకటించారు. 1997 ఆగస్టు నాటికి పట్టుమని వేయి ఇళ్ళయినా పూర్తి చేయలేకపోయింది. ఈలోగా మరొకసారి

వరదలు వచ్చాయి. మళ్ళీ హెలికాప్టర్ యాత్రలు, ఆర్భాట ప్రకటనలు, నిధులకు కొరతలేదని హామీలు.

## 23. రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో 1996 వరద సహాయంలో వైఫల్యం

1996వ సంవత్సరంలో రాయలసీమ జిల్లాలలో, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో సంభవించిన వరదల వల్ల దెబ్బతిన్న చెరువులకు, కాలవ గట్టులకు నేటికి మరమ్మతులు లేవు. ప్రకాశం జిల్లా రాళ్ళపాడు, నెల్లూరు జిల్లా అనంతసాగరం ప్రాజెక్టులు నేటికి మరమ్మతులకు నోచుకోలేదు.

ప్రకాశం జిల్లాలో వరదల వల్ల పొలాల్లో ఇసుకమేట వేసిన రైతులకు సహాయం అందిస్తామని ముఖ్యమంత్రి ఇచ్చిన హామీలు ఇంత వరకు కార్యరూపం దాల్చలేదు.

## 24. కరువులో సైతం...

ఈలోగా కరువొచ్చింది. దాంతో మరలా కొత్త ప్రచారం. 18 జిల్లాలలో కరువు వల్ల 5 వేల కోట్ల రూపాయలు పంట నష్టం - మరలా హామీలు, ప్రకటనలు. జూన్ నుండి సెప్టెంబర్ వరకు వర్షపాతం తగ్గిపోతే, కరువు రక్కసి కోరలు విదిలిస్తే, ఆకలి చావులు మొదలైనా, కార్మికుల వలస ప్రారంభమైనా, పంటలు పొడైనా, 20 లక్షల ఎకరాలలో నాట్లు పడకపోయినా ప్రభుత్వం కదలలేదు. మన హైటెక్ ముఖ్యమంత్రి చొరవ, కింగ్‌మేకర్ పలుకుబడి వలన సెప్టెంబర్ ఆఖరుకు కేంద్ర కరువు బృందం పర్యటనకు వచ్చింది. వచ్చే నాటికి మరలా వరదలు ఆరంభం.

*ఇంకేముంది – కరవు సమస్య పరిష్కారమయినట్లే.*

పంట పోయిన రైతుకు చేయగలిగింది ఏమిలేదని ఆర్థిక మంత్రి తేగేసి చెప్పారు.

## 25. పంటల భీమా పథకం:

96 నవంబర్‌లో పంట దెబ్బతిన్న రైతులకు సర్వేలు, విచారణ జరిపి 72 కోట్లు ఉభయ గోదావరి జిల్లాలలో పరిహారం చెల్లించాల్సిందిగా లెక్కతేల్చి ఆ డబ్బును హైటెక్ స్పీడ్‌తో 97 సెప్టెంబర్ నాటికి కూడా విడుదల చేయలేదు. ఈలోగా మరొక తుఫాన్ వచ్చేసింది.

రాష్ట్రం అనేక పర్యాయాలు తుఫాను, వరద, కరువు లాంటి ప్రకృతి వైపరీత్యాలకు గురై, రైతులు తీవ్రంగా నష్టపోయి నప్పటికీ, రైతులనాదుకోవడానికి కేంద్రంలో పలుకుబడి కలిగిన ముఖ్యమంత్రి సమగ్ర పంటల భీమా పథకం ప్రవేశ పెట్టేందుకు తగు చర్యలు తీసుకోలేకపోయారు.

## 26. ఆల్మట్టిపై రాజీ - రాష్ట్రానికి తీరని అన్యాయం

ఆల్మట్టి డ్యాం ఎత్తు పెంచితే ఆంధ్రుల నోట్లో మట్టేనన్న విషయం అందరికి తెలుసు. ఎత్తు పెంచితే నాగార్జుర సాగర్‌కు నీరు రాదు. అని ముఖ్యమంత్రే స్వయంగా ప్రకటిం చారు. దేవెగౌడ ప్రధానిగా ఉండి ఆంధ్ర అభ్యంతరాలను, విమర్శలను ఖాతరు చేయకుండా ఎత్తు పెంచేస్తున్నా, అదనపు నిధులు కేటాయించినా, మన కింగ్‌మేకర్ ఏమి చేయలేక పోయాడు. అసెంబ్లీ తీర్మానం చేసినా, అఖిల పక్షాలు సహక రించినా ముఖ్యమంత్రి రాష్ట్ర ప్రయోజనాల విషయంలో ఘోరంగా విఫలమయ్యారు. పుండుమీద కారంలాగ ఎగువ తుంగ ప్రాజెక్టు తుంగభద్ర నదీజలాల్లో 70 టి.ఎం.సి.ల నీటిని వినియోగించుకునేందుకు కర్నాటక ప్రభుత్వం శరవేగంతో ఈ ప్రాజెక్టును నిర్మాణం చేస్తుంటే, కింగ్‌మేకర్ చేష్టలుడిగి నిలుచు న్నారు. ఇది పూర్తయితే అనంతపూర్, కడప, కర్నూల్‌లలో లక్షలాది ఎకరాలు బీడు అయిపోతాయి. జాతీయ పార్టీలకు ఇతర రాష్ట్రాలలో కూడా శాఖలున్నాయి. మాకు అలాంటివేమీ లేవు. అందరికన్నా ముందుండి పోరాడతామని సి.ఎం భీకర ప్రకటనలు చేశారు. ప్రాజెక్టు పనులు ఆపందే చర్చలు లేవు అన్నారు (తరువాత చర్చలలో పాల్గొన్నారనుకోండి) కేంద్ర ప్రభుత్వం ద్వారా కమిటీ వేయించానన్నారు. తరువాత అదికాస్త అనధికార కమిటీగా మారిపోయింది. ఆగ్రహ ప్రకటనలు, పతాక శీర్షికలు ఆంధ్రలోనే కాని హస్తినలో ఏమి చేయలేకపోయాయి. అక్కడెవరూ ఈ ముఖ్యమంత్రిని లెక్కపెట్టలేదు.

ఆల్మట్టి - ఆంధ్రుల నోట్లో మట్టి

★ కర్ణాటక మా మాట పెడచెవిన బెట్టి ఆల్మట్టి డ్యామ్ ఎత్తు పెంచితే, కేంద్రం దీన్ని ఆపలేకపోతే కేంద్రంపై పోరాటం తప్పదు - విజయవాడలో ముఖ్యమంత్రి (20.3.96).

పోరాటం మర్చిపోయి - అధికారం కోసం ఆరాటమే - విధానమైంది.

★ 'ఆల్మట్టి పూర్తయితే నాగార్జున సాగర్‌కు నీళ్ళు రావు - ముఖ్యమంత్రి (20-3-96)

★ ఆల్మట్టిపై రాష్ట్ర ప్రయోజనాలను పరిరక్షించడానికి ఏ త్యాగానికైనా సిద్ధం ముఖ్యమంత్రి (18-7-96)

**కింగ్‌మేకర్ల పని రాజులను ఎంపిక చేయడమే కాని - ప్రజా సంక్షేమం కాదు కదా! ఆల్మట్టి పూర్తి కావచ్చినా ఆంధ్రుల నోట్లో మట్టి కొట్టినా, ముఖ్యమంత్రి నోట మాటలు రావు.**

## 27. కుంటుపడిన పారిశ్రామిక ప్రగతి

★ రాష్ట్రంలో 2000 సంవత్సరం నాటికి లక్ష కోట్ల రూపా యలు పారిశ్రామిక పెట్టుబడి లక్ష్యాన్ని సాధిస్తాం - ముఖ్య మంత్రి ప్రకటన (19-10-96)

★ గత ఏడాది 3203 కోట్లతో 52 మంది పరిశ్రమల స్థాపనకు ముందుకు వస్తే, ఈ ఏడాది 1003 కోట్లతో 26 కొత్త ప్రతిపాదనలు మాత్రమే అందాయి. (18.7.97 ఈనాడు)

**మరి లక్ష కోట్లు ఏనాటికో!**

'ఊరేగింపుకు ముందు నడిచే వారంతా నాయకులు కాలేరు. పత్రికలలో ప్రచారంతో ఎవరూ ప్రజా ప్రయోజనాల సంరక్షకులైన పాలకులు కాలేరు అంటే ఇదేనేమో'. ఢిల్లీలో చక్రం తిప్పేది మనమైనా, పెద్ద పెద్ద ప్రాజెక్టులన్నీ కర్నాటకకు, తమిళనాడుకు కదిలిపోయాయి. హోండా కార్ ప్రాజెక్టు హోసూర్‌కెళితే, ఫోర్డ్ కార్ ప్రాజెక్టు మరో చోటుకి తరలి పోయింది. హుండయ్ కారు ప్రాజెక్టు మంత్రి మారన్ తన్నుకు పోతే, టొయోటో కర్ణాటకకు మారిపోయింది. మలేషియా ప్రోటాన్ కార్ల ప్రాజెక్టు అంతులేదు. కింగ్ మేకర్ టైటిల్ మనకు దక్కింది కాని - రాష్ట్రానికి ఒక్క ప్రాజెక్టు వచ్చింది లేదు.

**మన కరెంటు కోత, మాటల కోతలు వారిని భయపెట్టా యేమో. 'ఆల్ పవర్‌ఫుల్ సి.ఎం హయాంలో మాటలు పవర్‌ఫుల్ - ప్రయోజనం నిల్'గా మారిపోయింది.**

## 28. పరిశ్రమల మూత - కార్మికుల కడుపు కోత:

రాష్ట్రంలో విద్యుత్ కొరత 35.8 శాతానికి పెరిగిపో యింది. దాంతో పరిశ్రమ పెట్టి వాడేవాడు మన రాష్ట్రం వైపు చూసేందుకు సిద్ధంగా లేదు. రాష్ట్ర ప్రభుత్వ రంగ సంస్థల్లో 15 సంస్థలను మూసివేయాలని ప్రభుత్వం వ్యూహాన్ని రూపొందిం చింది.

ఆల్విన్ ఆటో మూసివేత, మత్స్య పరిశ్రమ అభివృద్ధి సంస్థ, హిందూపురం చక్కెర ఫ్యాక్టరీ, అగ్రోకెమికల్ ఫ్యాక్టరీ, రిపబ్లిక్ ఫోర్జ్, గుంతకల్ స్పిన్నింగ్ మిల్, అజంజాహి మిల్స్ టెక్స్‌టైల్ అభివృద్ధి సంస్థ, ఎలక్ట్రానిక్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, వ్యవసాయ పరిశ్రమల అభివృద్ధి సంస్థ, ప్రవాస భారతీయులు పెట్టుబడి సంస్థ. హ్యాండిక్రాఫ్ట్ కార్పొరేషన్ ఇలా వరుసగా మూసివేతల క్యూలో వున్న సంస్థల్లో పనిచేసే ఉద్యోగులు 40 వేల మంది ఉన్నారు. సహకార నూలు మిల్లుల అమ్మకానికి ప్రభుత్వం ప్రకటనలు జారీ చేసింది. ఎస్.టి.సి టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ పారిశ్రామిక మౌలిక వస్తువుల సంస్థ నిజాం సుగర్స్, అటవీ అభివృద్ధి సంస్థలను కూడా ప్రైవేటీక రించాలని తెలుగుదేశం ఆలోచన ఈ మూసివేతలు ప్రైవేటీకరణ కమ్యూనిస్టులకు మింగుడుపడటం లేదు. అయినా వారు మింగ లేక కక్కలేక ఉన్నారు. 'విడవమంటే బాబుకు కోపం - కరవ మంటే కార్మికులకు కోపం - అయ్యోపాపం' ఫ్యాక్టరీల లేఆఫ్ సర్వసాధారణం, అజంజాహి మిల్స్ మూసివేత, ఇలా చిన్న పెద్ద పరిశ్రమలు మూతపడ్డాయి.

### కడుపుమండి కార్మికుని ఆత్మహత్య

నంద్యాల చక్కెర ఫ్యాక్టరీ కేన్ సెక్షన్ క్లర్క్‌గా పని చేస్తున్న వేణుగోపాల్, ఫ్యాక్టరీ లే ఆఫ్ ప్రకటించడంతో 7 నెలలుగా జీతాలు లేక అప్పుల పాలై బ్రతికి బావుకునేది లేదని భావించి రైలు పట్టాలపై నడిచాడు. శరీరం ముక్కలైంది. భార్య, ముగ్గురు పిల్లలు అనాథలయ్యారు. (19-7-97)

### ఆల్విన్ సంస్థ మూత - కార్మికుల బజారు పాలు:

★ ఆల్విన్ సంస్థను మూసివేసే ఉద్దేశం ప్రభుత్వానికి లేదు - ముఖ్యమంత్రి (24-11-95)

## 29. గీతకార్మికులపై భారం

గీత కార్మికుల రెంటల్స్‌ను ఒక్కసారిగా 10 నుండి 30 శాతం వరకు పెంచారు. ప్రభుత్వం 5 సంవత్సరాలకు లైసెన్సు ఇచ్చినా, సంవత్సరంలోగా చెట్ల రెంటల్స్‌ను పెద్ద ఎత్తున పెంచి గీత కార్మికుల పొట్ట గొట్టింది.

## 30. గొప్పలు చెప్పుకొని నష్టపోయిన రాష్ట్రం:

### లకడావాలా కమిటీ సిఫార్సుల ఫలితం

కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన లక్డావాలా కమిటీ సిఫారసుల వలన రాష్ట్రం గణనీయంగా కేంద్ర సహాయాలన్నీ కోల్పోయింది. మేం అన్ని ఇళ్ళు కట్టించాం, ఇంత బియ్యం పంపిణీ చేస్తున్నాం - ఇన్ని పథకాలు ప్రవేశపెట్టి ఇంత మందిని దారిద్ర్య రేఖకు దిగువ నుండి దాటించాం అని గొప్పలు చెప్పడం వలన లక్డావాలా సిఫార్సుల్లో రాష్ట్రానికి తీరని అన్యాయం జరి గింది. 36% మంది దారిద్ర్య రేఖకు దిగువన ఉంటే అదికాస్తా 23% తగ్గినట్టుగా భావించడం మూలాన, సహాయం కూడా తగ్గిపోయింది. 'అమ్మ పెట్టదు - అడుక్కు తిననివ్వదు' అన్న చందంగా తయారయింది.

## 31. హైటెక్ దక్షతకు నిదర్శనాలు

మంగళగిరి టైర్ల ఫ్యాక్టరీకి మంగళం, విమానాశ్రయాల అప్‌గ్రెడేషన్ గాలిలో, మారుతికారు ప్రాజెక్టు మరో జన్మలో, వాల్తేరు డివిజన్‌ను సౌత్ సెంట్రల్‌లో తీసుకు రాలేకపోవడం, కరవు, తుఫాన్‌లలో రాష్ట్రానికి న్యాయం చేకూర్చలేకపోవడం, తరచూ ప్రకృతి వైపరీత్యానికి గురవుతున్నా పంటల భీమా పథకం ఊసెత్తకపోవడం, ఆక్సెలరేటెడ్ ఇరిగేషన్ డెవలప్‌మెంట్ స్కీమ్ క్రింద కర్నాటకకు ఎక్కువ డబ్బులు కేటాయించారని గగ్గోలు పెట్టి, ఇచ్చిన నిధులను కూడా మార్చిలోగా వినియో గించుకోక 13.5 కోట్ల రూపాయలు మురిగిపోవడం, గ్రామీ ణాభివృద్ధి, ఎంప్లాయ్‌మెంట్ అస్యూరెన్స్ స్కీమ్‌ల అమలులో వెనుకబడిపోవడం - మన దక్షతకు నిదర్శనాలు. 2000 సంవత్స రాల వరకు మనకు కృష్ణా మిగులు జలాలు వినియోగించుకునే అవకాశం బచావత్ ట్రిబ్యునల్ కల్పించింది. ఆ తరువాత జరిగే పునః సమీక్షలోగా మనం ఎంత అదనంగా ఉపయో గించుకుంటే అంత హక్కు మనకొస్తుంది. సాగునీరు మనకు ప్రాణప్రద మైనది.

రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి ప్రధానమైంది. అయినా మన హైటెక్ ప్రభుత్వానికి ఇలాంటి లోటెక్ విషయాలు పట్టవా? కేంద్రం కదలకపోతే పోరాడతామని, అవసరమైతే రాజకీయ పోరాటం చేస్తామని, ప్రభుత్వం నుండి వైదొలగేందుకు కూడా వెనుకాడమని, మంత్రులు, ముఖ్యమంత్రి గంభీర ప్రకటనలు చేసారు. యథావిధిగా పత్రికలలో పతాక శీర్షికలను పొందారు. కాని ఈ బెదిరింపులకు ఢిల్లీలో ఎవరూ వీసమెత్తు విలువ ఇవ్వలేదు. తమ మాట జరగకపోతే టి.ఎం.సి పార్టీ ప్రభుత్వం నుండి బైటకెళ్ళింది. డి.ఎం.కె వైదొలగుతానని హెచ్చరించింది. ఫ్రంట్‌ల నేతలు నానా పాట్లు పడి బ్రతిమిలాడారు. **కాని మన రాష్ట్ర ప్రయోజనాలు దెబ్బతింటున్నా మన 'కింగ్ మేకర్'కు తమ టైటిలే ముఖ్యం.**

## 32. అవినీతిపై రాజీ:

అవినీతిపై రాజీ పునాదిగా ఏర్పడిన కాంగ్రెస్ సమర్థత కేంద్ర ప్రభుత్వానికి తెలుగుదేశం సారథి. అవినీతిపై రాజీలేని పోరాటం సాగిస్తామని తెలుగుదేశం పేర్కొన్నది. లంచగొండి తనం వల్ల బలహీన వర్గాలకు లాభించేది కాస్త నోటి ముందు నుండి దోచుకున్నట్టు అవుతుందని తెలుగుదేశం ఎన్నికల ప్రణాళికలో పేర్కొన్నది. గత ఎన్నికల్లో ఇంతకు ముునుపు కాంగ్రెస్ అవినీతిని ప్రధానంగా పేర్కొని, బోఫోర్స్ కుంభ కోణంపై పార్లమెంటు నుంచి సామూహిక రాజీనామాలు చేయించి, ఎన్నికల్లో కాంగ్రెస్‌ను ఓడించమని పిలుపునిచ్చిన తెలుగుదేశం ఆఖరుకు ఆ కాంగ్రెసుతోనే చేతులు కలిపింది. లంచగొండితనం, అధికార దుర్వినియోగం అంతం కావాలని ప్రణాళికలో పేర్కొన్న తెలుగుదేశం అవినీతికి మారు పేరైన కాంగ్రెస్‌తో చేతులు కలిపి, వారి అవినీతి కేసులను నీరు గార్చేందుకు, ఆలస్యం చేసేందుకు, కప్పిపుచ్చేందుకు ఫ్రంట్ ప్రభుత్వం చేస్తున్న సకల చర్యలకు సారథిగా నిలచింది. అవినీతిపరులైన కాంగ్రెస్ వారిని శ్రీ ఎన్.టి.ఆర్. జైలుకు పంపిస్తామని చెప్తుంటే ఈ తెలుగుదేశం ప్రభుత్వం వారికి బెయిల్‌కు ఎలా సహాయపడాలా అని నానా అగచాట్లు పడుతున్నది. అదేమంటే 'ఢిల్లీలో కోఆపరేషన్ - ఇక్కడ ఆపరేషన్' అంటా రు. అవినీతిలో హైటెక్ విధానం అవలంబించి తన ప్రత్యేకతను రుజువు పర్చుకుంది. ఆఖరుకు స్వంత పార్టీ ఎం.పియే పెరిగి పోతున్న అవినీతిపై విరక్తి చెంది నిరాహార దీక్షకు పూనుకున్నా డంటే పరిస్థితి ఎంతగా దిగజారిందో అర్థం చేసుకోవచ్చు.

తెలుగుదేశం ప్రభుత్వంలో అవినీతి ఎంతగా పెరిగిందంటే ఆఖరకు మిత్రపక్షమైన సిపిఐ కూడా ఆరోపణ చేయవలసి వచ్చింది. తెలుగుదేశం ప్రభుత్వంలో క్రిమినల్ కేసులతో సంబంధం ఉన్నవారు, అవినీతిపరులైన వారు ఏడుమంది మంత్రులుగా వున్నారని సిపిఐ బహిరంగ ఆరోపణ చేసింది.

వరంగల్, ఖమ్మం, కర్నూలు జిల్లాల్లో వేలాది ఎకరాల్లో అక్రమంగా సాగుతున్న గంజాయి వ్యవసాయం, వ్యాపారం అధికారపార్టీ అండదండలు లేనిదే సాధ్యమవుతుందా అనేది అందర్నీ ఆలోచింపజేస్తున్న ప్రశ్న.

## అన్నింటా అవినీతి

### 33. ఏలేరు భూసేకరణ - నష్టపరిహారం చెల్లింపు కుంభకోణం

ఏలేరు కాల్వ నిర్మాణానికి అవసరమైన భూములను రైతుల వద్ద నుంచి సేకరించి, వాటికి చెల్లించాల్సిన నష్టపరిహా రాన్ని ఎక్కువ చేసి చూపించి ప్రభుత్వ ఖజానా నుంచి సుమారు 14 కోట్ల రూపాయలు లూటీ కాబడిన ఉదంతం చంద్రబాబు నాయుడు పాలనలో అవినీతికి హైలైట్. ఈ కుంభకోణంలో ఆనాటి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి కూడా ప్రమేయముందని అధికార పార్టీ శాసన సభ్యుడు దాడి వీరభద్రరావు ఆరోపించిన విషయం అందరికీ తెలిసిందే.

### 34. విశాఖ పోర్టు భూముల కుంభకోణం

విశాఖపట్నం పోర్టు ట్రస్టు సేకరించిన భూములకు చెల్లించిన నష్టపరిహారం విషయంలో కూడా కొన్ని కోట్ల రూపా యలు గల్లంతయ్యాయని ఆరోపణలు వచ్చాయి. భూపరి మితి చట్టం క్రింద మిగులు భూమికి కూడా నష్టపరిహారం చెల్లించారని ఆరోపణ. విచారణ ఎంతకాలం నడుస్తుందో ఎవరికీ తెలియదు.

### 35. పారదర్శకత్వం లేని విద్యుత్ ఒప్పందాలు

1993లో కాంగ్రెస్ ప్రభుత్వం 1603 కోట్ల ఖర్చుతో విద్యుత్ ప్రాజెక్టును నెలకొల్పేందుకు ఒప్పందం చేస్తే, ఆనాడు ప్రతి పక్షంలో వున్న చంద్రబాబు నాయుడు అది అవినీతి ఒప్పంద మని, 250 కోట్ల రూపాయలు చేతులు మారాయని నానా రభస

చేసి, తాము అధికారంలోకి రాగానే అదే కంపెనీతో 2,384 కోట్ల రూపాయ ఒప్పందం చేశారు. ప్రాజెక్టు ప్రారంభం కాక ముందే 50 శాతం ప్రాజెక్టు వ్య పెరిగింది. 1603 కోట్ల ఒప్పందంలో 250 కోట్ల రూపాయలు చేతులు మారితే, 2384 కోట్ల ఒప్పందంలో ఎన్ని వందల కోట్లు చేతులు మారి ఉంటాయో! అదేమ 'మేము చేస్తే కరెక్టు - ఇతరులు ఎగ్రిమెంటు బహిరంగపర్చమంటే మన్నుతి పాములాగా మౌనం వహిస్తారు.

## 36. తుఫాన్ బియ్యం అక్రమ నిల్వలు

తుఫాను బాధితులను ఆదుకోవడానికి ప్రజల నుండి విరాళాల రూపంలో సేకరించిన బియ్యాన్ని అక్రమంగా నిల్వ చేశారని అధికార పార్టీ శాసన సభ్యుడు, మరో మంత్రిపై ఆరోపణలు వస్తే విచారణకు సైతం చంద్రబాబు ప్రభుత్వం సిద్ధపడలేదు

## 37. గృహనిర్మాణంలో కుంభకోణం

తూర్పుగోదావరి జిల్లా అమలాపురం డివిజన్‌లో, గృహ నిర్మాణ సం ఆధ్వర్యంలో జరుగుతున్న పక్కా గృహ నిర్మా ణంలో 10 కోట్ల రూపాయల కుంభకోణం జరిగిందని లీగల్ సెల్ ఇచ్చిన ఫిర్యాదుకు విచారణ జరుగుతుంది. చీ ఇంజనీర్లు కూడా విచారణ జరుపుతున్నారట.

ఇళ్ళు పూర్తి కాకపోయినా – స్కాములకు మాత్రం కొదువలేదు.

## 38. ఎల్ అండ్ టి ఇన్ఫోసిటీ ఒప్పందం

హైదరాబాద్‌కు సమీపంలోని మాదాపూర్‌లో ఇన్ఫాసిటీ నిర్మాణం కోసం ఎల్ అండ్ టి సంస్థకు రాష్ట్ర ప్రభుత్వం అతి చవకగా భూమిని కేటాయించడంలో పెద్ద ఎత్తున కుంభకోణం జరిగిందని ఆరోపణలు వచ్చాయి. ఇన్ఫాసిటీ నిర్మాణానికి అసలు టెండర్లనే పిలవకుండా ఎల్ అండ్ టి సంస్థకు నిబంధనలను తుంగలో తొక్కి కట్టబెట్టడంపై విచారణకు డిమాండ్ చేసినా ప్రభుత్వం సంసిద్ధం కాలేదు. గ్లోబల్ టెక్నోయాడ్స్ సంస్థ ఒక చదరపు అడుగు అభివృద్ధి చేయడానికి 2,200 రూపాయలకు ముందుకు వస్తే, కాదని 2,700 రూపాయలకు ఎల్.అండ్.టి సంస్థకిచ్చారు. చదరపు అడుగుకు 500 రూపాయలు ఎక్కువ కొటేషన్ వేసిన ఎల్.అండ్.టి.కి భవన నిర్మాణాన్ని అప్పగిం చారు.

## ౩9. బేగంపేట భూమి కొనుగోలు

బేగంపేట భూములు కొనగూడదన్న స్పష్టమైన జి.ఓ ఉన్నా హెరిటేజ్ ఫుడ్స్ డైరెక్టరు ఒకరు ఆ భూమిని కారుచౌకగా కొన్నారని అభియోగం వచ్చినా దానిపై ప్రభుత్వం స్పందన లేదు.

## 40. బంజారాహిల్స్ భూమి

ట్రస్టుల పేరుతో విలువైన ప్రభుత్వ భూమిని కేటా యిస్తూ జి.ఓలు జారీ చేయడంపై ఎన్ని విమర్శలు వచ్చినా ముఖ్యమంత్రి తన పని తాను చేసుకుపోతున్నారు. విలాసవంత మైన బంజారాహిల్స్‌లో అత్యంత విలువైన భూమిని ముఖ్య మంత్రి తమ ఆధిపత్యంలో ఉన్న ఓ ట్రస్టుకు కేటాయించారు.

## 41. జిల్లా పరిషత్ ఛైర్మన్ల అవినీతి

ఆదిలాబాద్, కరీంనగర్, కడప, తూర్పు గోదావరి, మెదక్, నెల్లూరు తదితర జిల్లా పరిషత్ ఛైర్మన్లపై అవినీతి ఆరోపణలు వస్తే, విచారణలో నిర్ధారణ అయినప్పటి ప్రభుత్వం చర్య తీసుకోవడానికి ముందుకు రాలేదు. ఆఖరుకు ఆదిలా బాద్, నెల్లూరు ఛైర్మన్లు కాంగ్రెస్‌తో చేతులు కలిపి, తమను ఎదిరించినప్పుడు మాత్రమే పార్టీ నుండి సస్పెండ్ చేయడం మినహా వారిపై చట్టపరమైన చర్య తీసుకోలేదు.

**తమవైపు ఉంటే నీతిపరులు – ఎదురు తిరిగితే అవినీతిపరులు – అంతే**

## 42. బెదిరింపులతో కాంట్రాక్టులు

అధికార పార్టీ శాసన సభ్యులు కాంట్రాక్టర్‌లని బెదిరించి టెండర్ ఫారాలని లాక్కుంటున్నారని, అనేకచోట్ల కాంట్రాక్టు లను ఎక్కువ రేట్లకు వారే స్వాధీనం చేసుకుంటున్నారని ఆరోపణలు వచ్చినా ప్రభుత్వం ఉలకదు, పలకదు. రాష్ట్రంలో ఇరిగేషన్, రైల్వే కాంట్రాక్టులన్నీ అధికార పార్టీ వారు, కాంగ్రెస్ మరియు సంఘ వ్యతిరేక శక్తులతో కలిసి ఏరియాల వారీగా పంచుకుంటున్నా, అడ్డమొచ్చిన వారిని హతమారుస్తున్నా ప్రభు త్వం పట్టించుకోదు.

తుఫాన్ పనులు, వరద మరమ్మతులు, జన్మభూమి పనులు, టెండర్ లేకుండా

అధికార పార్టీ వారే హస్తగతం చేసుకోవడం హైటెక్ విధానంలో ఒక భాగం. టెండర్ బాక్స్‌లు ఎత్తుకుపోయినా, యాసిడ్ పోసినా, రైల్ నిలయం వద్ద సాయుధ గణాలు బారులుతీరి పోరాటాలు చేసుకుంటున్నా, జిల్లాల వారీగా తెలుగు ముఠాలు మాఫియాలుగా మారి కాంట్రాక్ట్ పనులు స్వాధీనం చేసుకుని అమ్ముకుంటున్నా అడిగే దిక్కు లేదు. రాష్ట్రంలో పంచాయతీ రాజ్, ఇరిగేషన్, రైల్వే పనులు రెండేళ్ళలో ఎంత పెద్ద ఎత్తున అధికార పార్టీ ప్రథమగణం స్వాధీనం చేసుకుందో గమనిస్తే కళ్ళు తిరక్కమానవు.

సత్వర సాగునీటి ప్రయోజన (ఎ.ఐ.బి.పి) క్రింద శ్రీరాంసాగర్ ప్రాజెక్టు పరిధిలో రెండు ప్యాకేజీ లకు చేపట్టిన టెండర్లు 45% అధిక మొత్తానికి ప్రభుత్వం అనుమతిచ్చింది. ఈ పనులు సుమారు 50 కోట్లు చేస్తాయి. కాగా టెండరు అంచనా కన్నా 25% కన్నా ఎక్కువ వేసిన టెండర్లను రద్దు చేస్తామని 3.9.97న నీటిపారుదల శాఖా మంత్రి నాగేశ్వర రావు ప్రకటించారు. ప్రకటన ప్రచారానికే కదా! నీటి పారుదల శాఖ పనులకు స్వేచ్ఛగా టెండర్లు వేసుకునేందుకు ప్రాజెక్టు సర్కిల్ ఇంజనీర్ ఆఫీస్‌తో పాటు జిల్లా ఎస్.పి. కార్యా లయాల్లో కూడా టెండరు బాక్సులు ఉంచాలని అధికారులను ముఖ్యమంత్రి ఆదేశించారు. (15.11.97)

*అంటే పరిస్థితి ఎంత దిగజారిపోయిందో అర్థమవుతోంది*

## 43. జన్మభూమి పేరుతో

జన్మభూమి పేరుతో అన్ని రకాల పనులకు అత్యధిక మొత్తం ఎస్టిమేట్ వేయించి తెలుగు కాంట్రాక్టర్స్ ద్వారా పనులు పూర్తి చేయిస్తున్నారు. లక్ష రూపాయలు పనిని 2 లక్షలకు ఎస్టిమేట్ వేయిస్తే, 30 శాతం కాంట్రిబ్యూట్ కట్టినా 40 వేలు లాభమే కదా - ఇంతకన్నా హైటెక్ మెదడు ఇంకేముంది. పైపెచ్చు టెండర్లు లేవాయె! .

గ్రామాలలో చెరువుల మరమ్మతులు సాగునీటి సంఘా నికి ఇవ్వకుండా కాంట్రాక్టరుకు అప్పగించారని చిత్తూరు జిల్లాలో పేర్లతో సహా ప్రతిపక్షాలు ఆరోపణలు చేసినా, ప్రభుత్వం వట్టి ప్రకటనలతో త్రోసిపుచ్చింది. ఖమ్మం జిల్లా పనులను పరిశీలిం చిన అధికారులు పనులన్నీ కాంట్రాక్టర్లే చేస్తున్నారని తెలియ జెప్పడం జరిగింది.

జన్మభూమి కార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మ కంగా అమలు చేస్తున్నామని చెబుతున్నప్పటికీ ఆగస్టులో ఈ పథకం కింద చేపట్టిన మొక్కల పెంపకం ఆచరణలో నీరు కారిపోయింది. ఏడు కోట్ల మొక్కలు నాటినట్లు రికార్డులు చెబుతున్నప్పటికీ, అందులో 20 శాతం కూడా బతికిన దాఖలాలు లేవు. ఈ కార్యక్రమ సందర్భంగా సుమారు 5 కోట్ల రూపాయలు మట్టిపాలయిందని అంచనా.

## 44. మద్య నిషేధం మహా మంచి వ్యాపారం

రాష్ట్రంలో డిస్టిలరీలకు, బ్రూవరీలకు కాంగ్రెస్ హయాం లో సంతకం పెట్టిన మంత్రి బాపిరాజును తెలుగుదేశం రాజీనామా డిమాండ్ చేసింది. అదే డిస్టలరీల ఫైళ్ళపై నిషేధం అమలు వుండగానే సంతకాలు పెట్టారు.

మద్య నిషేధం అమలు సందర్భంగా చిత్తూరు, నెల్లూరు, అనంతపూర్, మహబూబ్‌నగర్ ఇలా సరిహద్దు జిల్లాలలో అధికార పార్టీ నాయకులు హోల్‌సేల్ వ్యాపారాన్ని నిర్వహించారు. ఇది అందరికీ తెలిసిన విషయం. శాసన సభ్యుల దొంగ వ్యాపారాలను అడ్డుకున్నారనే కోపంతో నలుగురు ఎక్సైజ్ కమిషనర్‌లు రెండు సంవత్సరాలలో ట్రాన్స్‌ఫర్ కావాల్సి వచ్చింది. పట్టుకున్న సారాను తగులబెట్టింది.

ఇప్పుడు త్వరలో బార్‌లకు లైసెన్స్‌లు, క్లబ్‌లకు అను మతులు అందిస్తున్నారు. రాష్ట్రంలో ప్రస్తుతం అన్ని జిల్లాలో సారా అందుబాటులో వున్నది. అక్రమ సారా వ్యాపారం అధికార పార్టీ అండలేనిదే సాధ్యం కాదు కదా. అధికార పార్టీ ఎం.ఎల్.ఎలు, ఎం.పి.లు అక్రమ మద్యం వ్యాపారం చేస్తుంటే నిరోధించాలని గట్టి ప్రయత్నం చేసిన కర్నూలు ఎస్.పి సురేంద్రబాబును 45 రోజులలో అతని నిజాయితీకి మెచ్చి ట్రాన్స్‌ఫర్ చేశారు. నిషేధం అప్పుడు అక్కడ పట్టుకున్నాం. ఇక్కడ పట్టుకున్నాం - ఇన్ని రోజులు, అన్ని లక్షలు అని లారీ నెంబర్లు కూడా ఇచ్చారు. కాని ఒకరిని కూడా జైలుకు పంపిన పాపాన పోలేదు.

గుంటూరు జిల్లా పొన్నూరు నియోజకవర్గ పరిధిలో మద్యం అక్రమ రవాణాదార్లను ఎక్సైజ్ సిబ్బంది అరెస్టు చేస్తే, శాసన సభ్యుని మద్దతుదార్లు ఎక్సైజ్ సిబ్బందిపై దాడిచేసి వారిని విడిపించుకుపోయిన సంఘటన అక్రమ మద్య వ్యాపారులకు

అధికార పార్టీ వారి మద్దతు ఎంత ఉందో స్పష్టం చేసింది.

రాష్ట్రంలో అక్రమ మద్యం చీకటి వ్యాపారానికి అధికార పార్టీ ప్రముఖుల అండదండలు ఉన్నాయన్న ఆరోపణలు ఉన్నాయి. అనేక మంది అధికార పార్ట శాసన సభ్యులకు ప్రమేయమున్నట్లు అధికారులే ప్రభుత్వానికి నివేదిక ఇచ్చారు. ముఖ్యమంత్రి అత్యంత సన్నిహితుడు సిఎం రమేష్ ఈ అక్రమ వ్యవహారానికి సూత్రధారి అనే ఆరోపణలు ఉన్నాయి. ముఖ్యమంత్రి సోదరుడు, శాసన సభ్యుడు శ్రీరామమూర్తి నాయుడు పేరు కూడా అక్రమ మద్య వ్యాపారుల లిస్టులో ఉంది.

## 45. ఫలితంలేని ప్రజల వద్దకు పాలన

ప్రజల వద్దకు పాలనలో ఎం.ఎల్.ఎలు, మంత్రులు, ఎం.డి.ఓ.లు, వి.డి.ఓ.లు హెలికాప్టర్‌లో ముఖ్యమంత్రి ఊరూరా తిరిగారు. అడిగిన వారికి అడిగినన్ని హామీలు ఇచ్చారు. 35 లక్షల అర్జీలు ప్రజల నుంచి వస్తే తర్వాత వాటి పరిష్కార విషయం మర్చిపోయారు.

ప్రచారం వచ్చిందిగా – పరిష్కారమెందుకు?

## 46. హెలికాప్టర్ ముఖ్యమంత్రి

- పాపం అంజయ్య హెలికాప్టర్‌లో అప్పుడప్పుడు ప్రయాణి స్తుంటే యాదగిరి హెలికాప్టర్ అంజయ్య నవ్వుల పాలయ్యారు.
- కాని ఇప్పుడు మన ముఖ్యమంత్రి హెలికాప్టర్, ప్రత్యేక విమానం లేనిది ఎక్కడికి వెళ్ళరు. వెళితే ఆ రోజు రోడ్ల పరిస్థితిపై ఆవేశం, ఆందోళన - మరి రోజు తిరిగే వారి గతేమిటో? ఈ హెలికాప్టర్ ఖర్చు ఎన్ని కోట్లో లెక్కకు అందకుండా వుంది. హెలికాప్టర్ ఖర్చులు, ప్రభుత్వ ప్రచార ప్రకటనల ఖర్చులు కలిపితే కొన్ని ప్రాజెక్టులైనా పూర్తి చేయవచ్చు.

### ఒక్క వారంలో మచ్చుకు ముఖ్యమంత్రి ఢిల్లీ ప్రయాణాలు

- కాంగ్రెస్ హయాంలో ముఖ్యమంత్రులుగా ఉన్న వారు ఢిల్లీకి వెళుతుంటే ఇరవైఒకటోసారి... ముప్పైఒకటోసారి అంటూ లెక్కలు కట్టిన తెలుగుదేశం

వారు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గారి క్రింది ఢిల్లీ పర్యటనల గురించి ఏం సమాధానం చెపుతారో?

| | | |
|---|---|---|
| సోమవారం | ఉదయం - హైదరాబాద్ | రాష్ట్ర అసెంబ్లీ ప్రారంభం |
| 17.11.97 | రాత్రి ఢిల్లీ-హైదరాబాద్ | ఫ్రంటు కోర్ కమిటీ సమావేశం |
| మంగళవారం | ఉదయం - హైదరాబాద్ | |
| 18.11.97 | రాత్రి ఢిల్లీ | ఫ్రంటు కోర్ కమిటీ సమావేశం |
| బుధవారం | ఉదయం - ఢిల్లీ | కోర్ కమిటీ మీటింగ్ |
| 19.11.97 | రాత్రి - హైదరాబాద్ | ప్రత్యేక విమానంలో అర్థాంతరంగా తిరుగు ప్రయాణం |
| గురువారం | ఉదయం - హైదరాబాద్ | |
| 20.11.97 | రాత్రి - ఢిల్లీ | సాయంత్రం పొద్దుపోయాక దేశ రాజధానికి |
| శుక్రవారం | ఉదయం - ఢిల్లీ | కోర్‌కమిటీ సమావేశం |
| 21-11-97 | రాత్రి - ఢిల్లీ | ఫ్రంటు నాయకులతో సమావేశం |
| శనివారం | ఉదయం - హైదరాబాద్ | --- |
| 22.11.97 | రాత్రి - హైదరాబాద్ | --- |
| ఆదివారం | ఉదయం - హైదరాబాద్ | --- |
| 23.11.97 | రాత్రి - ఢిల్లీ | ఢిల్లీకి ప్రయాణం |
| సోమవారం | ఉదయం - హైదరాబాద్ | --- |
| 24.11.97 | రాత్రి - ఢిల్లీ | ఫ్రంటు నాయకులను కలవటం |

ఇన్నిసార్లు ఢిల్లీ ప్రదక్షణలు చేసినా ఫ్రంటు సమావేశాలు తప్ప రాష్ట్ర ప్రయోజనాలను సాధించింది శూన్యం,

## 47. రైతాంగంపై చిన్నచూపు - రైతు వ్యతిరేక ధోరణి

ఈ ప్రభుత్వ హయాంలో రైతాంగాన్ని నిర్లక్ష్యం చేసినంతగా గతంలో ఎప్పుడూ జరుగలేదు. డీసిల్ ధర రెండు సార్లు పెరిగింది. కరెంటు ఛార్జీలు రెండు సార్లు పెంచారు. లైను చార్జీలు పెంచారు. డిపాజిట్ల భారం మోపారు. సొంత ట్రాన్స్‌ఫార్మర్లను రైతులనే సొంతంగా ఏర్పాటు చేసుకోమన్నారు. ఎరువుల ధర పెరిగింది. ఆహార ధాన్యాల రవాణాపై జిల్లా జిల్లా మధ్య, రాష్ట్రాల మధ్య ఆంక్షలు విధించడంతో రైతులకు గిట్టుబాటు ధర కరువయ్యింది. చెరుకు రైతుల బకాయిల చెల్లింపులో విపరీత జాప్యం, చెరకు రైతులకు మద్దతు ధర సీజన్ అయిన తరువాత ప్రకటించడం, పంటల భీమా పథకం అప్పుల భీమాగా మారినా, సమగ్ర పంటల భీమా పథకమే మా లక్ష్యమని చెప్పి విస్మరించారు. పట్టాదారు పాస్ పుస్తకాలు అసమగ్రంగా ఉన్నాయి. ఇంకా 40 శాతం మందికి చేరనేలేదు.

## 48. నిధుల తగ్గింపు కేటాయించిన వాటిని ఖర్చు పెట్టడంలో నిర్లక్ష్యం

బడ్జెట్‌లో పొరుగు రాష్ట్రాల్తో పోలిస్తే ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ రంగానికి నిధుల కేటాయింపు బాగా తగ్గిపోయింది. 92-93లో 5.4 శాతం, 94-95లో 4.3 శాతం, 95-96, 96-97లలో 3.5 శాతానికి కేటాయింపులు తగ్గిపోయాయి. మన పొరుగున వున్న తమిళనాడు వ్యవసాయ రంగానికి 8.1 శాతం నిధులను కేటాయించింది.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ సహకార రంగంలో నిధులను ఖర్చుపెట్టడంలో వెనుకబడి వుందని, అక్టోబరు 1 నాటికి 62.22 కోట్లు ఖర్చుపెట్టలేక పోయిందని, ఆఖరకు కేంద్ర వ్యవసాయ శాఖామంత్రి శ్రీ చతురానన్ మిశ్రా స్వయంగా ప్రకటించారు. (17.10.97)

## 49. గిట్టుబాటు ధరలు లేవు

ఈ ప్రభుత్వం రెండేళ్ల హయాంలో ప్రత్తి, మిర్చి, ధాన్యం, మినుములు ధరలు విపరీతంగా పడిపోయాయి. కేంద్రం వీటిలో కొన్నింటిని దిగుమతి చేసుకోవడం వలన రైతులకు గిట్టుబాటు ధర లేకపోయిందనేది సత్యం. మధ్యలో రెండేళ్ళలో రెండు సార్లు తుఫాన్, ఒకసారి కరవు రావడంతో రాష్ట్ర రైతాంగం తీవ్రంగా నష్టపోయారు. నష్టం 20

వేల కోట్ల రూపాయలు వుంటుందని అంచనా. మరొకవైపు భయంకరమైన కరెంటు కోత వలన మెట్ట ప్రాంతాల రైతులు తీవ్రంగా నష్టపోయారు. మోటార్లు కాలిపోయి, పంట ఎండిపోయి కోట్లాది రూపాయల నష్టం వాటిల్లింది.

## 50. అన్నదాతల ఆత్మహత్యలు

హైటెక్ ప్రభుత్వంలో ఆత్మహత్యలే శరణ్యం. ఒక వైపు ప్రకృతి ఆగ్రహం, మరొకవైపు ప్రభుత్వం నిర్లక్ష్యం, ఇంకొక వైపు అనవసర ఆంక్షలతో దిక్కుతోచని అన్నదాతలు ఆత్మహత్యలకు పాల్పడడం హైటెక్ ప్రభుత్వం యొక్క హైలెట్. నీళ్ళుండి కరెంటు లేక నిలువునా ఎండిన పైరును చూడ్డానికి బ్రతకాలా అని 13-3-97న మెదక్ జిల్లా దేవనకూచినపల్లి వాసి కుర్మ దుర్గయ్య ఉరివేసుకున్నాడు. అతనికి 40 ఏళ్ళకే నూరేళ్ళు నిండాయి. 10 ఏళ్ళ కొడుకు రేఖయ్య, 15 ఏళ్ళ కూతురు గౌరవ్వ దిక్కులేని వారయ్యారు. ఆ విషయంపై అసెంబ్లీలో అట్టుడికింది. కానీ రాత్రి ప్రతికలకు సి.ఎం కార్యాలయం నుండి అందిన ప్రకటనలో దుర్గయ్య అప్పులు చేసి ఆత్మహత్య చేసు కున్నాడని, విద్యుత్ కోత కారణం కాదని ప్రభుత్వం చెప్పింది.

### అప్పుకోసం తిరిగి ఆత్మహత్య:

చిత్తూరు జిల్లా కె.బి.పురం మండల వాసి గోవింద రాజులు కాళహస్తి కో-ఆపరేటివ్ బ్యాంకు చుట్టూ అప్పుకోసం తిరిగి తిరిగి హైటెక్ ప్రభుత్వ హయాంలో జరిగిన ఆలస్యాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడు.

### అప్పుకట్టలేక, అవమానం భరించలేక ఆత్మహత్య

మరొక రైతు పి.వెంకటరామారావు, బొమ్మిడి సహకార పరపతి సంఘం నుండి ఋణం తీసుకుని, పంటను కోల్పోయి నందున సకాలంలో చెల్లించలేకపోయాడు. రాష్ట్ర ప్రభుత్వం అధికారులు ఇళ్ళు జప్తుచేసి, వస్తువులు బైటవేసి అవమానం చేయడంతో, బజారుకి వెళ్ళి డబ్బు తెచ్చి అప్పు కడతానని పౌరుషంగా వెళ్ళి, అప్పు దొరకక పోవడంతో అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడు. ఆత్మహత్య మరుసటి రోజు ముఖ్యమంత్రి ఏలూరు కర్షక సదస్సు నిర్వహించినా కనీసం సంతాపం కూడా తెలియచేయలేదు. హైటెక్ సి.ఎం.కు ఇటువంటి లోటెక్ విషయాలు

పట్టించుకోరు కదా?

- తుఫాన్ బాధితుడు అయిన తెలుగుదేశం కార్యకర్త ముని రామయ్య, నెల్లూరు జిల్లా మరపల్లి గ్రామస్తుడు. తుఫాను కారణంగా ఆర్థికంగా చితికిపోయి, బ్యాంక్ నోటీసుతో బెంబేలెత్తి ముఖ్యమంత్రికి చెప్పుకుందామని హైదరా బాద్‌లో టి.డి.పి కార్యాలయంలో శత ప్రయత్నాలు చేసి షరా మామూలుగా చివరకు పోలీసులతో గెంటివేయిం చుకుని, నిస్పృహ చెంది, ఆత్మహత్యే శరణ్యమని తెలుగు దేశం కార్యాలయం ఎదుటే పురుగుల మందు త్రాగేశాడు.
- పంటలు ఎండిపోయి అప్పుకట్టుకోలేక గుంటూరు జిల్లా మేడికొండూరు మండల పాలడుగు గ్రామ వాస్తవ్యుడు గుంటుపల్లి సుబ్బారావు ఆత్మహత్య చేసుకొన్నాడు. (6.11.97)
- అప్పు చెల్లించే పరిస్థితి లేకపోవడంతో కరీంనగర్ జిల్లా కమాన్‌పూర్ మండలంలోని జూలపల్లి గ్రామానికి చెందిన ప్రత్తిరైతు, సింగిల్ విండో డైరెక్టర్ కోలబాపు క్రిమిసంహారక మందు తాగి ఆత్మహత్య చేసుకొన్నాడు. (17.11.97)

**ఇంకెన్ని ఆత్మహత్యలో:**

- ప్రత్తి పంటపోయి కడుపు మాడి, నిస్పృహ చెంది కరీంనగర్ జిల్లా ఇల్లెంతకుంట మండలం పగులాపూర్ గ్రామంలో పిల్ల కొమరయ్య ఆత్మహత్య చేసుకున్నాడు (6-10-97)
- వరంగల్ జిల్లా రేగొండ మండలం గేరికొత్తపల్లి రైతు రాజేశ్వరరావు అదే మార్గం ఎంచుకున్నారు (27.4.97)
- రంగారెడ్డి జిల్లా మహేశ్వరం మండలంలో మిర్చి రైతు అదే రోజు ఆత్మహత్యే శరణ్యమనుకున్నాడు.
- మరొక ప్రత్తి రైతు మారిశెట్టి కోదండ రామయ్య, గుంటూరు జిల్లా దాచేపల్లి మండలం, పెద్దగొర్లపాడు గ్రామం, ఆత్మహత్యే మార్గంగా ఎంచుకున్నాడు (31.3.96) ఇలా ఇంకా ఎన్నో...

★ ప్రత్తిపంట దారుణంగా దెబ్బతినటంతో కరీంనగర్ జిల్లా మంథని మండలం ధర్మారం గ్రామానికి చెందిన కటుకూరి భీమయ్య అప్పుల బాధ భరించలేక పురుగుల మందు త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడు. (11.12.97)

★ వరంగల్ జిల్లా పరకాల మండలం వెంకటాపురం గ్రామానికి చెందిన జంగు రవి అనే ప్రత్తి రైతు చేసిన అప్పు తీరే పరిస్థితి కానరాక దిక్కుతోచని స్థితిలో ఆత్మహత్యకు పాల్పడ్డాడు. (23.12.97)

★ వరంగల్ జిల్లా ఆత్మకూరు మండలం పెద్దాపూర్ గ్రామానికి చెందిన కొమ్ముల మల్లయ్య అనే రైతు వర్షాభావం వల్ల పంట పూర్తిగా దెబ్బతినడంతో క్రిమి సంహారక మందు తాగి మృతి చెందాడు. (25.12.97)

★ వరంగల్ జిల్లా సంగెం మండలం చింతపల్లి గ్రామంలోని చాపర్తి వీరాస్వామి అనే రైతు అప్పుబాధతో ఆత్మహత్య చేసుకున్నాడు. (25.12.97)

★ కరీంనగర్ జిల్లా సైదాపూర్ మండలం అకునూరు గ్రామానికి చెందిన మద్దూరు హనిమి రెడ్డి అనే రైతు వేరుశనగ పంట దెబ్బతిని ఆర్థిక వత్తిడి తట్టుకోలేక ఆత్మహత్యకు పాల్పడ్డాడు. (25.12.97)

★ అనంతపురం జిల్లా బెళుగుప్పకు చెందిన విశ్వనాథం అనే రైతు అప్పుల బాధ తాళలేక ఆత్మహత్య చేసుకున్నాడు. (25.12.97)

★ వరంగల్ జిల్లా గీసుకొండ మండలం నందనాయక తండాకు చెందిన గిరిజన ప్రత్తిరైతు బాదావత్ మంగ్యా ప్రత్తిపంటకు వచ్చిన నష్టాలకు తట్టుకోలేక ఆత్మహత్యకు పాల్పడ్డాడు. (29.12.97)

★ కర్నూలు జిల్లా మద్దికెరలో పందెర్లపల్లి తిరుమల రెడ్డి అనే ప్రత్తిరైతు అప్పుల బాధ భరించలేక క్రిమిసంహారక మందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు.

అయినా ఇవేవి హైటెక్ ప్రభుత్వాన్ని కదిలించలేక పోయాయి.

## 51. అన్నదాతపై లాఠీదార్జి

తెలంగాణా అంతా విద్యుత్ సమస్యపై అట్టుడికిపోతున్నది. రైతుల ధర్నాలు, అధికారుల ఘెరావ్‌లు, మాటతప్పిన ప్రభు త్వం వైఫల్యాలను ఒప్పుకోలేక రైతులపై లాఠీఛార్జీ జరిపింది. హత్యా నేరాలు మోపింది. ఆఖరుకు ఆందోళనకు ఎదుర్కొనలేని ప్రభుత్వం సబ్‌స్టేషన్‌లను స్వాధీనం చేసుకోమని పోలీసు శాఖను ఆదేశించింది.

## 52. అన్నదాతలపై కాల్పులు

నీటి తీరువా పెంచినందుకు నిరసన తెలుపుతున్న గోదావరి జిల్లా రైతులపై కాల్లరి గ్రామంలో ప్రభుత్వం నిర్దయగా కాల్పులు జరిపించింది. దీంతో ఇద్దరు రైతులు (అలపాటి రామచంద్రరావు, గండిమణి కృష్ణారావులు) నేలకొరిగారు. మరిద్దరు అవిటివారయ్యారు. ఆగ్రహిం చిన గోదావరి జిల్లా అట్టుడికిపోతే నెల రోజులలో విచారణ జరిపించి బాధ్యులపై చర్య తీసుకుంటామని సి.ఎం హామీ ఇచ్చారు. 1996 సెప్టెంబర్ 4న కాల్పులు జరిపితే హైటెక్ స్పీడుతో పనిచేసే ప్రభుత్వం 97 సెప్టెంబర్‌లో విచారణ మొదలుపెట్టింది. విజన్ 2020లో బహుశా నివేదిక వస్తుందేమో!

## 53. నీటి తీరువా పెంపు - రైతులపై పెనుభారం

నీటి తీరువా 100 శాతం పెంచారు. గత సంవత్సరం నుంచి వసూలు చేయనున్నారు. కరెంటు చార్జీలు 500 శాతం పెంచారు. ఆందోళనకు దిగిన వారిపై లాఠీలు ఝుళిపించి, ఇంకా కోపమొస్తే కాల్పులు జరిపించారు.

## 54. రవాణా ఆంక్షలు

ధాన్యం రవాణాపై ఆంక్షలు తొలగించమని, పొరుగు రాష్ట్రాలలో మంచి రేటు ఉందని రైతులు కోరితే హైటెక్ ప్రభుత్వం రైతులు అమ్ముకునేది ధాన్యం కాదు అని, బియ్యం రవాణాపై ఆంక్షలు తొలగించింది, దానికి పతాక శీర్షికలతో షరా మామూలుగా ప్రచారం లభించింది.

## 55. బకాయిల చెల్లింపులో జాప్యం

చెరకు రైతులకు చక్కెర ఫ్యాక్టరీలు బకాయిలు 80 కోట్లు ఉన్నా హైటెక్ ప్రభుత్వం కదలదు. పాల ఉత్పత్తిదారులకు 6 నెలలుగా బకాయిలు ఉన్నా అడిగే దిక్కు లేదు.

## 56. మార్కెట్ సెస్సు మళ్ళింపు

రైతులు తమ ఉత్పత్తులను గిట్టుబాటు ధరలకు అమ్ము కునే వీలు కల్పించేందుకు, రైతుల సౌకర్యార్థం మార్కెట్ యార్డుల అభివృద్ధికి వసూలు చేసిన మార్కెటింగ్ సెస్సును రైతుల సంక్షేమానికి ఉపయోగించక 300 కోట్లకు పైగా ప్రభుత్వమే వాడుకున్నది.

## 57. కల్తీ ఎరువులు

ఎరువుల సరఫరాలో కూడా ప్రభుత్వం విఫలమైంది. యూరియా, కల్తీ ఎరువుల జోరు ఎక్కువ కావడంతో ఎరువుల సరఫరా బోర్డు ఎదుట రైతులు ధర్నా నిర్వహించాల్సి వచ్చింది (7.9.96)

## 58. నిరుపయోగమైన కర్షక సదస్సులు

తన వైఫల్యాలను కప్పిపుచ్చుకునేందుకు షరా మామూలుగా హైటెక్ ప్రభుత్వం కర్షక విజ్ఞాన పరిషత్‌ల పేరుతో తెలుగు రాజకీయ మేళాలు నిర్వహించి రూ. 100 కోట్లకు పైగా ప్రజా ధనాన్ని దుర్వినియోగ పరిచింది. హెలికాప్టర్ యాత్రలు, ఉచిత బస్ సౌక ర్యాలు, మధ్యాహ్న భోజనాలు - అన్ని చేసినా సదస్సులు తుస్సుమన్నాయి. సాంస్కృతిక కార్యక్రమాలు, తారలు తళుకులు ఎన్ని ఎక్స్‌ట్రా ఆకర్షణలు పెట్టినా సదస్సులు ఫ్లాప్ అయ్యాయి. ఫలితం ఆర్.టి.సికి అధిక నష్టం. పరిష్కారం - బస్ ఛార్జీల పెంపుదల. వినోదాలు, ఉచిత భోజనాలు, ఉచిత ప్రయాణాలు, ఖజానాపై పెనుభారం మోపాయి. కోట్ల కొద్ది ఖర్చుపెట్టి కలర్ కరపత్రాలు ముద్రించినా చదివేవారు, పంచేవారు లేక అవి అన్ని కాళ్ళ క్రింద నలిగిపోయాయని ప్రముఖ పత్రికలే ప్రకటించాయి.

- కడపలో కర్షక సదస్సులో కరెంటు కోసం రైతులు గగ్గోలు పెట్టడంతో ముఖ్యమంత్రిప్రసంగం అర్థంతరంగా ఆగి పోయింది.
- మొక్కుబడిగా కర్షక సదస్సు సి.ఎం. వెళ్ళగానే షామి యానాలన్నీ ఖాళీ .
- తాడేపల్లి గూడెంలో జరిగిన కర్షక విజ్ఞాన సదస్సు రైతులకు విజ్ఞానాన్నందించడంలో విఫలమైంది - ఈనాడు (21.6.97).
- కర్షక సదస్సులో కష్టాలు చెప్పుకోడానికి వచ్చిన రైతులపై లాఠీచార్జి - ఇంతకంటే మహాపాపం మరొకటి ఉంటుందా?

## 59. అశాంతి నిలయంలో విశ్వవిద్యాలయాలు

సరస్వతీ నిలయాలు అశాంతి నిలయాలుగా మారాయి - ఆంధ్రజ్యోతి (16.11.97)

- మూడు విశ్వవిద్యాలయాలకు వైస్‌చాన్సలర్‌లే లేరు (ఆంధ్ర, పద్మావతి, వెంకటేశ్వర) ఆచార్య రంగా యూనివర్సిటీలో ర్యాగింగ్ పేరుతో జూనియర్ విద్యార్థిని సామూహిక లైంగిక అత్యాచారం, గత సంవత్సరం అనురాధ అనే విద్యార్థిని వికృత చేష్టలకు గురయ్యారు. మాధురి అనే విద్యార్థిని ర్యాగింగ్ భరించలేక ఆత్మహత్య చేసుకోగా, అనూరాధపై శాడిస్టు ఒకడు యాసిడ్ పోస్తే ఆమె మృత్యువుతో పోరాడుతోంది. నవంబరు 10వ తేదీన నాగార్జున విశ్వవిద్యాలయంలో నాచావుకు వి.సి.యే కారణం అని చెప్పి శ్రీపతి రవికుమార్ అనే ఎం.ఎ. విద్యార్థి హాస్టల్ గదిలోనే ఆత్మహత్య చేసుకున్నాడు. ఉస్మానియా యూనివర్సిటీలో కళాశాలలు జరుగు తుండగా, పట్టపగలే హాస్టల్‌లో ప్రవేశించి చంద్రారెడ్డి అనే విద్యార్థిని తీవ్రవాదులు కాల్చి చంపారు. నవంబరు 14వ తేదీన మతపరమైన ఊరేగింపులు ఉస్మానియా యూని వర్సిటీలోకి తీసుకెళ్ళి హాస్టల్‌పై దాడిచేసి విద్యార్థుల ఫర్నిచర్‌ను ధ్వంసం చేశారు. కాలేజీ సర్వీస్ కమీషన్‌కు చైర్మనే గాని ఇంతవరకు సభ్యులు లేరు.

## ౬౦. విద్యార్థుల భవిష్యత్తుతో చెలగాటం - పరీక్షల నిర్వహణలో ఘోర వైఫల్యం

గ్రీకువీరుడు సినిమాలాగా లీకువీరుడు సినిమా తీయ వచ్చు. 'కెజి నుండి పిజి' వరకు ఈ ప్రభుత్వ హయాంలో లీక్ కాని పరీక్షా పత్రం లేదంటే అతిశయోక్తి కాదేమో పబ్లిక్ స్కూల్ ఫస్ట్‌క్లాస్ ప్రవేశ పత్రాలు లీక్ అయ్యాయి. MBA, EAMCET, EDCET, LAWCET ఇంటర్ పరీక్షా పత్రాలు లీక్ అయ్యాయి. APPSC, MPDO పరీక్షా పత్రాలు కూడా లీక్ అయ్యాయి. హాజరు కానివారు ఉత్తీర్ణులు కావడం, మార్కులు తారుమారు కావడం, పరీక్షా పత్రాలు రైలు బోగీలలో దొరకడం హైటెక్ విద్యావిధాన హైలైట్స్. ఈ లీకేజీల వలన విద్యార్థులు, వారి తల్లిదండ్రులు పడ్డ పాట్లు, అనుభవించిన మానసిక క్షోభ వర్ణనాతీతం. గత రెండేళ్ళలో 70 శాతం పరీక్షా పత్రాలు లీక్ అయ్యాయి. ఎమ్‌సెట్ కన్వీనర్ రాజారావు టోకుగా ప్రశ్నా పత్రాలను అమ్మివేశారు. ఇంటర్ ప్రశ్నాపత్రాలను లీక్ చేసిన రామబ్రహ్మాన్ని పట్టుకోడానికి 'హైటెక్'కు ఆర్నెల్లు పట్టింది. తన వెనుక చాలా మంది పెద్దలు వున్నారని అతడు ప్రకటించాడు. ఇంజనీరింగ్ కాలేజీల సంతర్పణ, కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీ నాయకుల మధ్య పెద్ద మనుషుల ఒప్పందం బాగా కుదిరి, సెక్యులరిజం కోసం మజ్లిస్ వారికి కూడా కాలేజి సంతర్పణ చేసి విద్యా వ్యాపారాన్ని జోరుగా ప్రోత్సహించారు. విద్యార్థుల ఫీజులు 200 శాతం ఒకేసారి పెంచిన ఘనత కూడా ఈ ప్రభుత్వానిదే.

- విద్యా సంవత్సరం పూర్తవుతున్నా ఇంకా కళాశాలల సంతర్పణ కొనసాగుతూనే వుంది.
- పరీక్షా పత్రాలు పోయి దొరికాయి (చేరవలసిన చోటికి చేరి వచ్చి ఉంటాయి (ఈనాడు 18.9.95).
- ఎంసెట్ పేపర్లు రీవాల్యుయేషన్ చేయమని హైకోర్టు 6.12.95న తీర్పు ఇవ్వాల్సి వచ్చిందంటే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు.
- హాజరుకాని విద్యార్థికి ర్యాంక్ రావడం ఈ హైటెక్ ప్రభుత్వ హైలెట్ అని పత్రికలలో చదివే వుంటారు.

ఇంటర్ బోర్డు నిర్వాకం

అవినతి, అక్రమాలకు నిలయమైన ఇంటర్ బోర్డులో మార్కుల జాబితాలలో స్కాం జరుగుతుంది. (ఆంధ్రజ్యోతి 19-11-97). ఇంటర్ మార్కుల జాబితాలను బజార్లో వేల రూపాయలకు అమ్ముతున్నట్టు ఆరోపణలొచ్చాయి.

ఇంటర్మీడియెట్ బోర్డు అస్తవ్యస్త నిర్ణయాలు, పాడావిడి పనులు విద్యార్థులను నానా వెతలకు గురిచేశాయి. కేవలం 15 రోజుల ముందు 62 లక్షల ప్రశ్నాపత్రాలు ముద్రించటానికి ప్రింటింగ్‌కు ఇవ్వడంతో అనేక ప్రశ్నలలో తప్పులు దొర్లాయి. దాంతో స్పాట్ వాల్యూయేషన్ సెంటర్‌కు పంపిన కీలో ప్రశ్నలకు సమాధానం రాసే ప్రయత్నం చేస్తే చాలు. మార్కులు వేసేయమన్నారు. గత సంవత్సరం మాథ్స్ ప్రశ్నాపత్రంలో 23 మార్కులకు ప్రశ్నలు తప్పుగా వచ్చాయి. ఈసారి సప్లిమెంటరీ సంస్కృతం కీలో కూడా రెండు జవాబులు తప్పుగా వచ్చాయి. రాయచోటి, మిర్యాలగూడ రెండు సెంటర్లలో పేపర్లు తారుమారయ్యాయి. మెదక్ బాలికల జూనియర్ కాలేజీకి సంస్కృతం పేపరు అందలేదు.

గత మార్చి నెలలో ఇంటర్ ప్రశ్నా పత్రాలు లీకయ్యి తద్వారా ఈసారి పకడ్బందీగా పరీక్షలు నిర్వహిస్తామని చెప్పి, పరీక్ష మొదటి రోజు ఇంగ్లీషు ప్రశ్నాపత్రం బదులు తెలుగు ప్రశ్నాపత్రం పంపారు. (రాయచోటి, మిర్యాలగూడ కేంద్రాలలో). ప్రశ్నా పత్రాలు చేరక పోవడంతో అధికారులు సంగారెడ్డి కేంద్రానికి ఫోను చేసి తెలుసుకుని బ్లాక్‌బోర్డుపై రాసిన నిర్వహించాల్సి వచ్చింది. మహబూబ్‌నగర్ జిల్లా ఆత్మకూరులో కూడా ఇలానే జరిగింది (అక్టోబర్, 27, ఈనాడు)

## 61. ర్యాంకుల తారుమారు

*2798-9628 - హైటెక్ మహిమ:*

97 ఎంసెట్ పరీక్షలో కుమారి స్వప్న పరీక్ష చక్కగా రాసింది. మంచి ర్యాంకు వస్తుందని ఆశించింది. కాని హైటెక్ ప్రభుత్వం చేయిజోరు కదా అందుకని చిన్న ర్యాంకు ఎందుకని పెద్ద ర్యాంకే ఇచ్చేసింది. పాపం ఆ అమ్మాయి గత్యంతరం లేక హైకోర్టుకు వెళితే 9628 అని ప్రకటించిన ర్యాంకు 2798గా సరిదిద్దారు.

## 62. పేపర్ల గల్లంతు:

10వ తరగతి కామన్ ఎంట్రెన్స్‌లో విశాఖ జిల్లా దేవరాపల్లి పరీక్షా కేంద్రంలో హాల్ టికెట్ నెం. 150289, పరీక్ష వ్రాసి ప్రథమ శ్రేణి వస్తుందని ఆశిస్తే ఫలితం విత్‌హెల్డ్ చేశారు. విచారిస్తే జనరల్ సైన్స్ పేపరు గల్లంతు అయ్యిందట. హైటెక్‌లో లోటెక్‌కు ప్రాధాన్యత ఇవ్వడమేమో మరి.

- మామూలు యూనివర్సిటీలలోనే కాక - ఓపెన్ యూని వర్సిటీలలో కూడా మార్కుల స్కామ్ (11.7.96)

## 63. రద్దయిన పరీక్షలు

- ఆంధ్రా యూనివర్సిటీ మెట్రిక్ పరీక్షలలో మాస్ కాపీయింగ్ జరిగినందు వలన 8 కాలేజీలలో పరీక్షలు రద్దయ్యాయి.
- ఇంటర్ పరీక్షలు రద్దు చేశారు (11.4.97)
- ఆంధ్రా యూనివర్సిటీల్లో డిగ్రీ పరీక్షలలో సంస్కృతం, తెలుగు పత్రాలు కూడా లీక్ అయ్యాయి (16.4.97)

## 64. 97, మెడికల్ అడ్మిషన్స్ రద్దు

- లోకల్, నాన్‌లోకల్ రిజర్వేషన్లు పాటించే విషయంలో నిబంధనను అతిక్రమించినందున ఈ విద్యా సంవత్సరానికి గాను యం.బి.బి.యస్. మొదటి సంవత్సరానికి జరిపిని అడ్మిషన్లను రద్దుచేస్తూ రాష్ట్ర హైకోర్టు తీర్పునిచ్చింది. అడ్మిషన్లు పూర్తయి క్లాసులు మొదలయ్యాంతర్వాత ఈ విధంగా జరగటం గమనార్హం. (11.12.97)

## 65. పరీక్ష రాయకపోయినా ర్యాంక్

- హైటెక్ ప్రభుత్వంలో పరీక్ష రాయకపోయినా ర్యాంక్ - మెదక్ జిల్లా కొండపాక విద్యార్థి రూడం బాలకిష్టకు పరీక్ష వ్రాయకున్నా ర్యాంకు వచ్చింది (20.6.97)
- ఎంసెట్ పరీక్షలో ఇద్దరు అభ్యర్థులకు ఒకే నెంబరు ఇచ్చారు.

## 66. పుస్తకాల కుంభకోణం

- పరీక్షల కుంభకోణమే కాదు. పుస్తకాల కుంభకోణం కూడా జరిగిందని 3.9.96న మంత్రిగారే అసెంబ్లీలో అంగీకరించారు. 97, 98 విద్యాసంవత్సరంలో ఇప్పటికీ స్కూళ్ళు తెరిచి 5 నెలలు గడిచినా తెలుగు భారతి పాఠ్య పుస్తకాలను విద్యార్థులకు అందించటం ప్రభుత్వం మరచిపోయింది. జాతీయ విద్యావిధానం ప్రకారం పాత పుస్తకాలను నిషేధించారు. కానీ కొత్తపుస్తకాల సరఫరా ఇప్పటికీ పూర్తికాలేదు. ఒకటి, రెండు తరగతులకు పుస్తకాలే లేవు.

## 67. భర్తీ కాని టీచర్ల పోస్టులు

- వేలాది టీచర్ల పోస్టులు ఖాళీగా వున్నాయి. వందలాది లెక్చరర్ల పోస్టులు ఖాళీగా వున్నాయి. డాక్టర్లు, మెడికల్ ప్రొఫెసర్ల పోస్టులు ఖాళీగా వున్నాయి. ఇరిగేషన్, ఇంజ నీరింగ్ శాఖలో వందలాది ఖాళీలు, పార్ట్ టైమ్ వృత్తి విద్యా కోర్సులలో 10 సంవత్సరాల నుండి వెట్టిచాకిరి చేస్తున్నా పోస్టుల భర్తీ లేదు. అయినప్పటికి ఖాళీ పోస్టులపై 26.7.96న ప్రభుత్వం నిషేధం విధించింది.

## 68. హైటెక్ ప్రభుత్వంలో ఆర్థిక క్రమశిక్షణ కరవు

- ఓవర్‌డ్రాఫ్ట్‌లు, జీతాలు చెల్లించకపోవడం, జీతాలు తప్ప వేరే వాటికి డబ్బులు చెల్లించవద్దని ట్రజరర్‌కు ఆదేశాలు ఇచ్చారు. ప్రపంచ బ్యాంకు చుట్టూ ప్రదక్షిణలు - హైటెక్ హైలెట్స్.
- బడ్జెట్‌లో పన్నులు విధించకుండా లోటు బడ్జెట్ చూపి అనంతరం భారీగా వడ్డించడం ఈ ప్రభుత్వ హైలెట్.

## 69. అప్పుల ఊబిలో ఆంధ్ర

- రాష్ట్రం ఏర్పడిన నాటి నుం 1956 నేటి వరకు వివిధ ప్రభుత్వాలు 17 వేల కోట్ల ఋణం చేస్తే మన హైటెక్ ప్రభుత్వం రెండేళ్ళలోనే 11 వేల కోట్లకు అర్జీపెట్టి 8 వేల కోట్లకు అంగీకారం పొందిందట. దిగుల్లేదు - అప్పుచేసి

వచ్చుకూడు తినవచ్చు. రోజూ హెలికాప్టర్‌లో తిరగొచ్చు

ఇవి కాకుండా 500 కోట్ల రూపాయల ఇరిగేషన్ బాండ్లను జారీ చేశారు. దొరికిన చోటల్లా అప్పు తీసుకొచ్చి, ఎక్కడ ఖర్చుపెట్టాలో తెలియకుండా దుబారా చేయటం వల్లే మన ప్రణాళిక సైజు తగ్గిపోయింది కూడా. సంబ రాలకు, ప్రచారాలకు అయ్యే ఖర్చు కోట్లలో ఉంటుంది. **'జనపీడన - రుణయాతన - ఇది బాబుపాలన'** అని పత్రికలుసైతం వ్యాఖ్యానించాయి.

## 70. చార్జీల పెంపు - పన్నుల పెంపులో ఫస్ట్

- ఎన్నికలకు ముందు సంక్షేమం కొనసాగిస్తాం, ప్రజలపై భారం వేసే ప్రసక్తే లేదు. మనసుంటే మార్గం లేదా అని చెప్పిన ప్రభుత్వం 2658 కోట్లు భారం విధించి మనసులో మార్గం ఏమిటో బైటపెట్టింది.
- విద్యుత్ ఛార్జీల పెంపు ద్వారా 1492 కోట్లు, సబ్సిడీ బియ్యం ధర పెంచి 613 కోట్లు, టర్నోవర్ టాక్స్ ద్వారా 220 కోట్లు వృత్తి పన్ను ద్వారా 60 కోట్లు, ఎంట్రీటాక్స్ పేరిట 50 కోట్లు, లక్సరీ టాక్స్ 25 కోట్లు, వాటర్‌సెస్‌ను పెంచి అదనంగా 200 కోట్లు అన్నీ కలిపితే 2658 కోట్లు ఎందుకయ్యా ఇదంతా అంటే - మహాత్మా గాంధీ సాక్షిగా మద్య నిషేధం అమలు సాకు చూపారు. 97 మార్చితో మద్య నిషేధం తొలగించి 1200 కోట్ల రాబడిని పొందారు.

## 71. భూముల రిజిస్ట్రేషన్ ఛార్జీలు కొండపైకి

- భూముల రిజిస్ట్రేషన్ ఛార్జీలు పెంచకుండా హైటెక్ అలోచనతో భూముల విలువను 100 శాతం పైగా పెంచి వేసి ఆదాయానికి హైటెక్ మార్గం కనుగొన్నారు. ఎవరైనా భూమి కొనాలంటే పాతిక వంతు ప్రభుత్వానికి సమ ర్పించుకోవాలి.

## 72. ప్రణాళికా కేటాయింపుల్లో కోత

- బడ్జెట్‌లో కేటాయింపులను విడుదల చేయడంలోను, ఖర్చు పెట్టడంలోను ప్రభుత్వం విఫలం అయింది.

అలాగే ఆఖరికి ప్రణాళిక కేటాయింపులను కూడా తగ్గించుకోవాల్సి వచ్చింది. 95-96 ప్రణాళిక కేటా యింపులకు 3159 కోట్ల నుండి 2500 కోట్లకు తగ్గించాలని ముఖ్యమంత్రే స్వయంగా ప్రణాళికా సంఘాన్ని అర్థించారు. 96-97లో ప్రణాళికా కేటా యింపు 2,988 కోట్లు. ప్రతి సంవత్సరం 10 నుండి 15 శాతం పెరుగుదల ఉండాల్సి ఉండగా, రెండవ సారి గత సంవత్సరం కన్నా 200 కోట్లు తగ్గింది.

రెండేళ్ళలో ప్రజలపై సుమారు 3,500 కోట్ల రూపా యలు పన్నులు వేసినా ప్రణాళికపై కోత ఎందుకు పెడు తున్నారో అర్థం కావటం లేదు. ప్రభుత్వ రంగ సంస్థలను, భవనాలను, ప్రభుత్వ భూములు లాంటి స్థిరాస్థులను అమ్మి ఆదాయంగా చూపించటం అశాస్త్రీయ విధానం.

## 73. ఎన్నికలకు ఎగనామం

హైదరాబాదు కార్పొరేషన్‌కు, సివారు నగరాలైన తొమ్మిది మున్సిపాలిటీలకు ఎన్నో ఏళ్ళుగా ఎన్నికలు లేవు. రాజధానిలోనే ప్రజాస్వామ్యం లేదు. దొడ్డిదారిన అధి కారుల ద్వారా పరిపాలించుకునే అవకాశం ఉన్నప్పుడు ఎన్నికలెందుకు? ఎదుటివారికి అవకాశమివ్వటం ఎందు కనుకున్నారు కాబోలు.

## 74. సి.యం.ఇ.ఆర్.వై

ముఖ్యమంత్రి తనపేరుతో పెట్టుకున్న యువశక్తి పథకా నికి కూడా నిర్లక్ష్యమే విధానమైంది. **'ప్రచారంలో శ్రద్ధ - అమలులో నిద్ర'** ఇది సి.యం.ఇ.ఆర్.వై. పై ఈనాడు పతాక శీర్షిక. (9.11.97) గత ఆర్థిక సంవత్సరంలో సగం లక్ష్యం కూడా నెరవేరలేదు. ఎంపికైన యువజన సంఘాలు ఉత్పత్తులను ప్రారంభించాయో, లేదో కనుక్కునే అధికారే లేడు. వీటి గ్రౌం డింగ్ కోసం ఒక్కొక్క యూనిట్‌కు 5 నుండి 10 వేల రూపా యల వరకు పర్సంటేజ్ రూపంలో వసూలు చేస్తున్నారట.

## 75. అధికారులే లేరు - ఇక పరిపాలన ఎక్కడ

రాష్ట్రంలో 150 మండలాలకు పైగా మండల రెవెన్యూ అధికారులు లేరు. పక్క మండల అధికారులను ఇన్‌చార్జిలుగా పెడుతున్నారు. అదేవిధంగా ఎం.డి.ఓ.ల పోస్టులు

కూడా చాలా భాగం ఖాళీ వున్నాయి. రాష్ట్రంలో 15 శాతం మండలాలలో అధికారులే లేకపోతే పరిపాలన ఏముంది? ప్రజా సమస్యల పరిష్కారమేముంది?

## 76. ప్రభుత్వ ప్రచార సాధనాల దుర్వినియోగం - ప్రజాధనం ప్రచారం పాలు

చెప్పిందేమిటి?

నాకు ప్రచారం వద్దు. ప్రకటనలో నా ఫోటోలు వేయ వద్దు, నేను శంకుస్థాపనలు చేయను పనులు పూర్తి చేస్తాను, నేను నిద్రపోను, మిమ్ములను నిద్రపోనివ్వను, రాత్రిళ్ళు కూడా రాష్ట్రాన్ని గురించే ఆలోచిస్తా - ముఖ్యమంత్రి

చేస్తుందేమిటి?

ముఖ్యమంత్రి చేసినన్ని శంకుస్థాపనలు బహుశా మరె వరూ చేసివుండరు. అనేక పునాదిరాళ్ళు కాంగ్రెస్ హయాంలో లాగే ఇప్పుడు కూడా సమాధి రాళ్ళు గానే మిగిలిపోయాయి. అది వేరేకథ. పత్రికల్లో లభిస్తున్న అధిక ప్రచారం చాలక, దేశంలో ఎక్కడా లేని విధంగా రేడియో, టి.వి.ల్లో వారానికోసారి ముఖ్యమంత్రితో ముఖాముఖి పేరుతో ప్రచార సాధనాలను సొంత ప్రచారం కోసం వాడుకోవడం జరుగుతున్నది. (దేశంలో ఏ ఇతర ముఖ్యమంత్రికీ అవకాశం లేదు) అది చాలదన్నట్లు ఆ కార్య క్రమాన్ని ముగించి, వారానికోమారు అన్నిపత్రికల్లో కోట్లు ఖర్చుపెట్టి ఫుల్‌పేజి ప్రకటనలు ఇచ్చుకోవటం వారి విధానం. తుఫాను బాధితులను ఆదుకోవడానికి నిధులు లేవు, బిల్లులు చెల్లింపుకు డబ్బులు లేవు, బిల్లుల చెల్లింపులు ఆపివేయమని ట్రెజరీకి ఆదేశాలు ఇచ్చారు, ఉద్యోగస్థుల జీతాలకు కూడా డబ్బులు లేవు, కానీ ఫుల్‌పేజీ ప్రకటనలకోసం నిధులకు కొదవలేదు.

## 77. రాష్ట్రంలో శాంతికి సెలవు - భద్రతకు కరవు:

'రాష్ట్రంలో ప్రజలకు జీవించే హక్కు వుందా?'

రాష్ట్రంలో శాంతి భద్రతల పరిస్థితి నానాటికీ దిగజారి పోతోంది. సాయుధ ముఠాలు, మాఫియా గ్యాంగులు రోజు రోజుకి పెట్రేగి పోతున్నాయి. రైళ్ళ దోపిడీ,

బస్సుల దోపిడీ సర్వసామాన్యమై పోయింది. ముఠా కక్షలు, సామూహిక దాడులు ఎక్కువయ్యాయి. భూఆక్రమణలు పెచ్చుపెరిగి పోయాయి.

## 78. నక్సలైట్ల పోటీ పరిపాలన

తీవ్రవాదులు ఇష్టారాజ్యం చేస్తున్నారు. తెలంగాణాలో స్థానిక స్వపరిపాలన ఆగిపోయింది. అభివృద్ధి కుంటుపడింది. అధికారులు, నాయకులు గ్రామాలు వదిలి పట్టణాలకు తరలి పోతున్నారు. ప్రజాప్రతినిధులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని జీవిస్తున్నారు. ప్రభుత్వ, ప్రైవేటు ఆస్తులు కోట్ల కొలది ధ్వంసమవుతున్నాయి. తెలంగాణాలో ప్రబలిన తీవ్రవాదం, రాయలసీమ, సర్కార్ జిల్లాలకు విస్తరించింది. ఉత్తరాంధ్ర గెరిల్లా జోన్‌గా ప్రకటించి కోస్తాలో తీవ్రవాదులు హింసాకాండ ముమ్మరం చేశారు. ప్రజా ప్రతినిధుల చేత బలవంతపు రాజీనామాలు, పార్టీల నుండి రాజీనామాలు, తీవ్రవాదుల ఆదేశం మేరకు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు అన్ని రాజకీయ పార్టీల వారు పాల్గొనాల్సి రావడం, అడ్డు తిరిగిన వారిని హతమార్చడం సర్వసాధారణమై పోయింది. ప్రభుత్వం తీవ్రవాదులకు భయపడి తెలంగాణాలో 56 పోలీసు స్టేషన్లను ఎత్తివేసింది. హైదరాబాద్, నిజామాబాద్ సెక్షన్‌లలో రైళ్ళ రాకపోకలను కూడా రద్దు చేసింది. కొన్ని బ్యాంకులను కూడ ఎత్తివేసింది - కాశ్మీర్‌లో మాత్రమే ఇలా జరిగింది.

పోలీసు స్టేషన్‌లపై దాడులు జరిపి ఆయుధాలు ఎత్తుకుపోతున్నా అడిగే దిక్కులేదు. స్వయాన హోం మంత్రి ఇల్లు కూల్చేసినా, గిరిజన శాఖ మంత్రి ఇల్లు పేల్చివేసినా, తెలుగుదేశం ఎం.పి తమ్ముడిని కాల్చేసినా, ఎం.ఎల్.ఏ అన్న పూర్ణమ్మ ఇల్లు దోచేసినా హైటెక్ ప్రభుత్వం స్పందించదు. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రభుత్వ కార్యకలాపాలు స్తంభించి అభివృద్ధి అడుగంటి రాజకీయ కార్యకర్తలు స్వేచ్ఛను కోల్పోయి, సామాన్య జనం జీవించే హక్కును తీవ్రవాదులు హరించి వేస్తుంటే ప్రభుత్వం చనిపోయిన వారికి సంతాపం బ్రతికి బైట పడిన వారికి నష్టపరిహారం అన్నట్టుగా వ్యవహరించడం సిగ్గు చేటు. జాతీయ రహదారులపై మందుపాతరలు పేల్చి పోలీసులను, ప్రజాసేవకులను మట్టుపెడుతున్నా ఇవేమి తనకు సంబంధించి నవి కాదన్నట్టుగా ప్రభుత్వం వ్యవహరిస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో జనం చస్తుంటే మన

ముఖ్యమంత్రి యు.పి.కి వెళ్ళి ఉపన్యాసాలు ఇస్తున్నారు.

## 79. తీవ్రవాదుల హింసాకాండ

1996-97 సంవత్సరంలో అంటే చంద్రబాబు అధి కారంలోకి వచ్చిన మొదటి ఏడాదిలో తీవ్రవాదులు 56 కోట్ల రూపాయలు విలువైన ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేశారు. అలాగే పోలీసు ఇన్‌ఫార్మర్ల పేరిట 116 మందిని పొట్టన పెట్టుకున్నారు. ప్రభుత్వం తలవంచుకోవలసిన విషయమేమంటే ఈ ఒక్క ఏడాదిలో 47 మంది పోలీసుల్ని చంపేశారు. 12 పోలీసు స్టేషన్‌లు పేల్చి వేశారు. 13 మందుపాతర సంఘటనలు జరిగాయి. 74 ఆర్.టి.సి బస్సుల్ని 34 ప్రభుత్వ వాహనాలను దగ్ధం చేశారు. ఒక టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లను తగులబెట్టారు. 52 ప్రభుత్వ భవనాలను నాశనం చేశారు. 11 రైల్వేస్టేషన్లను, 1 టి.వి రిలే స్టేషన్‌ను. రెండు మైక్రోవేవ్ స్టేషన్లను ధ్వంసం చేశారు. ఇంకో ప్రక్కన తెలంగాణాలో పీపుల్స్‌వార్ పన్నుల వసూళ్ళకు కూడా పూనుకుంది. ఏటా భూమి శిస్తు, ఇంటి పన్నుని 'వార్' గ్రామరాజ్య కమిటీలకే పోవాలని తాఖీదులు ఇచ్చారు.

- 97 ప్రథమార్థంలో 6 పోలీసు స్టేషన్లపై దాడిచేసి ఆయుధాలను ఎత్తుకుపోయారు.
- 2.12.95న ఒంగోలు పట్టణ కేంద్రంలో పట్టపగలే ఎం.పి మాగుంట సుబ్బిరామిరెడ్డిని తీవ్రవాదులు హత్య చేశారు.
- ఎబివిపి నాయకుడు చంద్రారెడ్డిని పట్టపగలే యూని వర్సిటీ హాస్టల్‌లో కాల్చి చంపేశారు (4.3.97)
- మెదక్ జిల్లా రామాయంపేట ఎం.ఎల్.ఎ ఇల్లు పేల్చి వేశారు. (21.3.97)
- నరసంపేట ఎం.ఎల్.ఎ ఏపూరి ప్రకాశరెడ్డి ఇళ్ళు పేల్చివేశారు. (9.1.96)
- మాజీ మంత్రి మాదిరి నరసింహారెడ్డి ఇల్లు పేల్చివేశారు (26.6.96)
- మెదక్ జిల్లా శివ్వంపేట మండలం పిల్లుట్ల గ్రామ సమీపంలో వార్‌గ్రూపు మందు పాతర పేల్చి వేసిన సంఘటనలో డి.ఎస్.పి బాలసుబ్రహ్మణ్యం, సి.ఐ

వెంకటస్వామితో సహా ఎనిమిది మంది ప్రాణాలను బలిగొన్నారు. (17.11.1997)

- వరంగల్ జిల్లా వర్ధన్నపేట యస్.ఐ. పి.వి.రఘును నక్సలైట్లు కాల్చి చంపారు. (21.11.97)

## 80. ప్రభుత్వ ఉదాసీనత

- తీవ్రవాదులు ప్లీనరీ సమావేశాలు ఏరియాల వారీగా, మెదక్, కరీంనగర్, నిజామాబాద్, ఖమ్మం, ఆదిలాబాద్ జిల్లాలలో వ్యాపిస్తే పతాక గోష్ఠులు నిర్వహిస్తున్న మరుసటి రోజు పేపర్‌లో ఫోటోలొచ్చినా హైటెక్ ప్రభు త్వానికి చీమకుట్టినట్లయినా లేదు.
- టిడిపి, ఎంఎల్ఏ, మంత్రులు కొందరు తీవ్ర వాదులకు అనుకూలంగా మాట్లాడడం, పట్టుకున్న వారిని విడిపించేందుకు ప్రయత్నాలు చేయడం మామూలే.
- తీవ్రవాదులకు ఆయుధాలు చేరవేస్తున్నందుకు గాను నిజామాబాద్‌లో తెలుగు దేశం ఎం.ఎల్.ఏ. సోదరుణ్ణి పోలీసులు అరెస్టు చేయాల్సి వచ్చింది. 20కి పైగా జపాన్ లో తయారైన హ్యాండ్ గ్రనేడ్స్‌ను నిజామా బాద్‌లో స్వాధీనం చేసుకున్నారు.
- పోలీసులు తీవ్రవాదులకు తుపాకులందించే వరకు పరిస్థితి వెళ్ళిపోయింది.
- ప్రభుత్వరంగ సంస్థ అయిన ఐ.డి.ఎల్. కంపెని తయారు చేసిన 500ల డిటోనెటర్స్ తీవ్రవాదుల నుండి స్వాధీనం చేసుకున్నారంటే పరిస్థితి ఎలా దిగజారిందో అర్థం చేసుకోవచ్చు.
- ఎ.కె.47 తుపాకులు ఎక్కడయినా దొరుకుతున్నాయి.
- వరంగల్‌లో ఆయుధాలు తయారు చేస్తున్న ఫ్యాక్టరీని పోలీ సులు స్వాధీనం చేసుకున్నారు. (సెప్టెంబర్ 11న) అంటే పరిస్థితి ఎంతవరకు వచ్చిందో అర్థమవుతుంది కదా.

ఒక వైపు రాత్రింబవళ్ళు పోలీసులు తీవ్రవాదులతో పోరాడుతుంటే అధికార

పార్టీ నేతలు ఎం.ఎల్.ఎలతో సహా నక్సలైట్లతో మిత్రుత్వం సాగిస్తున్నారు. పోలీసుల నైతికపై స్థైర్యాన్ని ప్రభుత్వమే నీరుగారుస్తోంది.

## 81. మహిళలపై అత్యాచారాలు:

- కంచె చేనుమేస్తుంటే- ఆడపడుచులను ఆదుకునేదెవ్వరు.
- 97 ఏప్రిల్ 26న ఏలూరు పట్టణంలో ఆరుగురు కానిస్టేబుళ్ళు - పేద మహిళలను ఈడ్చుకొని ఎక్సైజ్ శాఖ అసిస్టెంట్ కమిషనర్ ఆఫీసుకు తీసుకెళ్ళి సాముా హికంగా మానభంగం చేశారు. గర్భవతి అయిన ఒక మహిళ ఈ అకృత్యంలో గర్భం పోగొట్టుకుంది. మరొక మహిళకు దాహమైతే ఆమె నోట్లో సారా పోశారు. మరి మహాత్ముని సాక్షిగా పాలించే హైటెక్ ప్రభుత్వంలో ఇలాంటివి మామూలే కదా!
- గోదావరిఖనిలో దళిత మహిళ సుజాతపై రోమియోలు మార్చి నెలలో ఆసిడ్‌తో దాడి జరిపారు.
- మదనపల్లి నుండి తిరుమలేశుని దర్శనానికి వచ్చిన మహిళ అత్యాచారానికి గురయ్యింది.
- మహబూబ్‌నగర్ జిల్లా బంటమీదపల్లి గ్రామం వెంకట మ్మను మానభంగం చేసి కాల్చి చంపేశారు (మార్చి 30)
- నిజామాబాద్ జిల్లా చికనూరు మండలం శివాయిపల్లెలో ఒక వితంతువు సామూహిక మానభంగానికి గుర య్యింది.
- విశాఖపట్నం ఇందిరా జువాలాజికల్ పార్కులో పట్టపగలే వివాహితపై అత్యాచారం జరిగింది.
- కడప జిల్లా దిమ్మెర నంద్యాలలో ఒక అమ్మాయిని 30 రోజులపాటు బంధించి, హింసించి, సామూహిక మాన భంగం చేశారు.
- సికింద్రాబాద్, నేరేడ్‌మెట్టలో శ్యాంసన్ అనే కానిస్టేబుల్ 14 సంవత్సరాల బాలికను మానభంగం చేశాడు.
- ఫతేనగర్‌లో గ్యాంగ్ రేపు - విశాఖలో ఏడు గ్యాంగ్ రేపులు - ఇవి వార్తలు)

- ముంబాయి నుండి వచ్చిన ముగ్గురు టీనేజ్ అమ్మా యిలను ఇద్దరు పోలీసు అసిస్టెంట్ కమిషనర్‌లు వారం రోజుల పాటు బంధించి మానభంగం చేశారని వార్త లొస్తే, దానిల్లో నిజమే లేదని పోలీసులు కొట్టివేశారు.
- ప్రకాశం జిల్లా చీరాల వన్‌టౌన్ పోలీస్ స్టేషన్‌లో సభ్య సమాజం సిగ్గుపడే రీతిలో కంచే చేనుమేసిన చందంగా ఎస్.ఐ. సమక్షంలోని పోలీసులు ఇద్దరు మహిళలను వివస్త్రలను చేసి అత్యాచార యత్నం చేశారు. (ఈనాడు 23.11.97)
- పోలీసుల లెక్కల ప్రకారమే 1997 సంవత్సరం మొదలు కుని ఆర్నెల్లలో 439 మంది మహిళలు అత్యాచారానికి గురయ్యారు.

## 82. తెలుగుదేశం నాయకుల నిర్వాకం

- కర్నూలు జిల్లాలో ఆళ్ళగడ్డ పరిధిలోని రుద్రవరం పోలీసు స్టేషన్ లాకప్‌లో ఉన్న ప్రత్యర్థులపై *(రాంపుల్లారెడ్డి సోదరునిపై)* తెలుగుదేశం ఎం.పి అనుచరులు, తమిళ నాడు నుంచి వచ్చిన కిరాయి రౌడీలు కలిసి, దాడిచేసి అడ్డమొచ్చిన పోలీసు లను పొడిచి పారిపోయా రంటే పరిస్థితి ఎంత దిగజారిపోయిందో అర్థం చేసుకో వచ్చు. గోవర్ధన్ అనే తమిళ కిరాయి ముఠా నాయకుడు ఉపయోగించిన టాటా సుమో, టి.డి.పి ఎం.పి, భూమా నాగిరెడ్డి పేరుతో రిజిస్టర్ అయి వుంది.
- హైదరాబాద్‌లో భూముల వివాదంలో సాక్షాత్తు తెలుగు కేంద్ర మంత్రి శ్రీమతి రేణుకా చౌదరి ప్రభుత్వంపై విశ్వాసం లేక నేరుగా పోలీసు స్టేషన్‌కి వెళ్ళి పోలీసులను నిలదీయటం హైటెక్ యొక్క హైలెట్.
- రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రి శ్రీ శ్రీనివాస యాదవ్ నగరం నడిబొడ్డున ఉన్న భూమిని కొన్న రేటుకే తనకు అమ్మాలని, లేకుంటే తీవ్ర పరిణామాలు తప్పవని సాక్షాత్తు సచివాలయానికి పిలిపించి భూమి యజమానికి అధికార పూర్వకంగా హెచ్చరిక చెయ్యడం శాంతిభద్రతల దిగజారు డుకు ఎవరు ఎంత మేరకు కారణమో తెలియ జేస్తుంది.
- శాసన సభ్యులు ఇరిగేషన్, రైల్వే కాంట్రాక్టు పనులను స్వాధీనం చేసుకోవడానికి

కూడా బలాన్ని, దండబలాన్ని వినియోగిస్తున్న విషయం అందరికీ తెలుసు.
*'కంచె చేను మేస్తే ఇక కాపాడేదెవరు?'*

- విజయవాడలో నాన్‌బెయిలబుల్ వారంట్ పెండింగ్‌లో వున్నా నిన్నటి కాంగ్రెస్, నేటి తెలుగు ఎం.ఎల్.ఎ సాక్షాత్తు ముఖ్యమంత్రి ప్రక్కనే ప్రజావేదికపై ప్రత్యక్షమయ్యేసరికి దిక్కుతోచని పోలీసులు కోర్టు ఉత్తర్వులను అమలు జరిపితే ఎంత నిరసన అధికారులకు ట్రాన్స్‌ఫర్లు.
- ముద్దుక్రిష్ణను నాయుడిపై దాడి (పుత్తూర్ ఎం.ఎల్.ఎ)
- ఎం.ఎల్.ఎ గంగాధర కాంట్రాక్టరులను కిడ్నాప్ చేసి ఎం.ఎల్.ఎ ఇంటిలోనే నిర్బంధించాడని పత్రికలలో వార్తలొచ్చాయి.
- బాంబులు, మారణాయుధాలతో రైల్వే టెండర్ల కోసం తెలుగుదేశంలోని రెండు వర్గాలు కొట్టుకుని బాంబులు వేసుకున్నారు (15.10.96)

## 83. రైలు దోపిడీలు

- ఒక్క రోజులో నెల్లూరు - కావలి రైల్వే స్టేషన్‌ల మధ్య గాంధీ జయంతి రోజు (2-10-1997) మారణాయు ధాలతో దాడిచేసి బొకారో హైదరాబాద్, సర్కార్ ఎక్స్‌ప్రెస్, నారాయణాద్రి 473 విజయవాడ, కాకినాడ, తిరుపతి ప్యాసెంజర్ రైళ్ళను ఒకే ముఠా వారు దోచు కున్నారు.
- 97 ఆగస్టునెలరోజుల్లో గోదావరి, గౌతమి ఎక్స్‌ప్రెస్‌లు దోపిడికి గురయ్యాయి.

## 84. బస్సు దోపిడీలు, దొంగతనాలు

- హైదరాబాద్‌లో 3 నెలల్లో 20 బందిపోటు దొంగతనాలు జరిగాయి. జగిత్యాలలో, బీబీనగర్‌లలో బస్సుదోపిడి, నాయుడుపేటలో దోపిడి ఇలా రోజుమార్చి రోజు బస్సు దోపిడీలు.
- హైదరాబాద్ చార్మినార్ వద్ద బ్యాంకు దోపిడీ
- విశాఖపట్నంలో ఫెడరల్ బ్యాంక్ పట్టపగలే సినిమా ఫక్కీలో దోపిడీ (హైటెక్ పాలనలో హైటెక్ దోపిడీలు)

- గుంటూరు - విజయవాడ జాతీయ రహదారిపై నాగార్జున యూనివర్సిటీ వద్ద బస్సు దోపిడీ.
- శ్రీకాకుళం జిల్లా పాలకొల్లు పట్టణంలో వెంకటేశ్వర దేవాలయంలో దోపిడీ.
- తిరుమల రెండవ ఘాట్‌లో ఆర్.టి.సి బస్సు దోపిడీ ఆగస్టు 96.
- కర్నూలు జిల్లా కోయిలకుంట్లలో పాండురంగ స్వామి ఆలయంలో 50 లక్షల విలువైన విగ్రహాల దొంగతనం. (2.11.97)
- గార్లలో వెంకటేశ్వర స్వామి దేవాలయం దోపిడి.

ఆఖరుకు దేవాలయాలను సైతం దోపిడీయే!

## 85. రాజధానిలో ఐ.ఎస్.ఐ. కార్యకలాపాలు

- పాకిస్తాన్ గూఢచార సంస్థ ఐ.ఎస్.ఐ కార్యకలాపాలకు హైదరాబాద్ స్థావరమయిందని అందరికీ తెలిసిందే. అయినా ప్రభుత్వం నోరెత్తదు.

## 86. హత్యలు, దాడులు

- ఒంగోలు సహకార బ్యాంకు మాజీ ఛైర్మన్ నల్లూరి ఆదిశేషయ్య హత్య.
- ప్రముఖ నాయకుడు మద్దూరు సుబ్బారెడ్డిని పట్టపగలే హత్యచేశారు.
- భీమవరం మునిసిపల్ ఛైర్మన్ కట్టా శివయ్యను పట్టపగలే బాంబులతో దాడిచేసి చంపేశారు (జూన్ 29)
- రైల్వే కాంట్రాక్టుల టెండర్ సందర్భంగా రైల్ నిలయంలో సాయుధ ముఠాల దాడి కారణంగా ఒక కాంట్రాక్టర్ మృతి చెందాడు.
- ఎం.పి భూమానాగిరెడ్డి, ఆళ్ళగడ్డ ఎం.ఎల్.ఎ శోభా నాగిరెడ్డిలపై 97 జులై 2న బాంబుదాడి జరిగింది.
- తిరుపతిలో పట్టపగలు కడప నుండి వచ్చిన సాయుధ ముఠాలు లారీలో, ట్రాక్టర్లలో ఊరేగింపుగా వచ్చి భూములను ఆక్రమించుకునేందుకు వెళ్ళిన సందర్భంగా జరిగిన పోరు తెలుగు స్టంట్ సినిమాను తలపింపచేసింది.

హత్యలు - దాడులు

హైదరాబాద్‌లో జూబ్లీహిల్స్‌లో రామానాయుడు స్టూడి యో సమీపంలో రాజ్యసభ సభ్యుడు మోహన్‌బాబు, శాసనసభ్యుడు పరిటాల రవిపై హత్యా ప్రయత్నాల్లో కారుబాంబు పేలుడు కారణంగా 26 మంది మరణిం చారు. (19.11.97)

## 87. పోలీసులకే దిక్కులేకపోతే ప్రజలకు దిక్కెవరు ?

- మెదక్ జిల్లా సంగారెడ్డి మండలం కాశీపూర్‌వద్ద ఆర్టీసీ బస్సును దోచుకుని, దారికాచి ఆదారిన వస్తున్న ఎస్.ఐ. రషీద్‌పై దాడిచేసి చంపివేశారు. అతనివద్దనున్న రివాల్వ రును కూడా దోచుకున్నారు. ఇక ప్రజలకు దిక్కే-మిటి?

మంత్రి కిష్టప్ప ఎస్కార్టుపై దాడి

రాష్ట్ర చేనేత జౌళి శాఖల మంత్రి నిమ్మల కిష్టప్ప ఎస్కార్టు జీపుపై గోరంట్ల సమీపంలో దోపిడీ దొంగలుగా భావిస్తున్న 6గురు జరిపిన దాడిలో ఎ.ఆర్.ఎస్.ఐ. షేక్ ఫక్రుద్దీన్ తీవ్రంగా గాయపడ్డారు. (30.11.97)

## 88. బలహీన వర్గాలపై దాడులు

- వరంగల్ జిల్లా ఘనపూర్ మండలంలో హరిజన సర్పంచ్‌ను ఆగస్టు 15న జాతీయ పతాకం ఎగుర వేయకుండా నిరోధించారు.
- కరీంనగర్ జిల్లాలో విశ్వబ్రాహ్మణులను సంఘ బహిష్క- రణ చేస్తే ప్రభుత్వం ఉదాసీనం.
- తూర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామం సమీపంలో హరి జన యువకులను అధికార పార్టీ మద్దతుదారుడైన ఎం.ఎల్.ఎ తోట త్రిమూర్తులు శిరోముండనం చేయిం చారు. పార్టీ పరమైన చర్యలేదు.

## 89. గిరిజనులు గిరిజనేతరుల మధ్య చిచ్చు:

ప్రభుత్వ నిర్లక్ష్యం కారణంగా గోదావరి జిల్లాలో గిరిజన, గిరిజనేతరుల మధ్య

వైరం పెరిగి ఆయుధాలతో బహిరంగ దాడులు, రైతులకు గాయాలు, గిరిజనులపై పోలీసుల వీరంగం ప్రభుత్వం ఉదాసీనతకు మరో మచ్చుతునక.

## ౯౦. నష్టాల్లో కార్పొరేషన్లు- మరొక వంక పదవుల పందేరం

ప్రతిజ్ఞా పూర్వకంగా హామీ ఇచ్చిన సంక్షేమ పథకాలను కుదించి, ఆర్థిక పరిపూర్ణతకి, అనవసర వ్యయాన్ని తగ్గిస్తానన్న సి.ఎం శ్రీనివాసన్ కమిటీ కొన్ని కార్పొరేషన్‌లను రద్దు చేయ మన్నా, 20 కార్పొరేషన్లను మూసేయాల్సిందిగా సిఫారసు చేసినా, తమ పార్టీకి చెందిన 34 మందిని ఎస్.ఎఫ్.సి, ఐ.డి.సి, మార్క్‌ఫెడ్, సివిల్ సప్లైస్, డి.సి.కార్పొరేషన్లకు డైరెక్టర్లుగా తనకు వెన్నుపోటులో సహకరించిన ఎం.ఎల్.ఎలకు పదవులు పందేరం చేపట్టారు. చాలా సంస్థలు జీతభత్యాలు కూడా చెల్లించ లేని స్థితిలో ఉన్నాయని చెప్పిన సి.ఎం ఈ నియామకాలు చేయడం విడ్డూరం కాదా?

రాష్ట్రంలోని 39 పబ్లిక్‌రంగ సంస్థల్లో 95 మార్చి నాటికి 21 కార్పొరేషన్లు 100 కోట్ల రూపాయల నష్టంతో నడుస్తు న్నాయని తెలుగుదేశం విడుదల చేసిన శ్వేతపత్రం పేర్కొన్నది. కాని అదే కార్పొరేషన్లకు శ్రీ చంద్రబాబు తమ పార్టీ వారిని చైర్మన్లు, డైరెక్టర్లుగా నియమించి నష్టాలను మరింతగా పెంచారు. మరి వారికి ఫోను, ఫ్యాను, పాన్ అన్నీ ప్రజలే భరించాలి కదా!

## 91. నిరుద్యోగుల్లో నిస్పృహ

రాష్ట్రంలో ఈ ప్రభుత్వం వచ్చిన అనంతరం ఖాళీలను భర్తీ చేయొద్దని నిషేధం పెట్టింది. (తెలుగుదేశం కార్యకర్తలకు మాత్రం నష్టాల్లో నడుస్తున్న కార్పొరేషన్ల పదవులు కట్టబెట్టిం దనుకోండి) రాష్ట్రంలో నిరుద్యోగుల సంఖ్య సుమారు 30 లక్షలు చేరుకుంది. ఇక రాబోయే రోజుల్లో ఉద్యోగాలన్నీ కాంట్రాక్టు ప్రాతిపదికపైనేనట.

## 92. ఎం.ఎల్.ఎ. క్వార్టర్స్... సిగ్గు సిగ్గు

ఎం.ఎల్.ఎ క్వార్టర్స్ సహితం విందు, మందు-పొందు అడ్రస్ ఎం.ఎల్.ఎ క్వార్టర్స్ ఇది ఒక ప్రముఖ దినపత్రిక పతాక శీర్షిక. ఎం.ఎల్.ఎ క్వార్టర్స్ జూదం,

వ్యభిచారం, తాగుబోతులకు నిలయంగా మారాయి. ఒక క్వార్టర్‌లో పర్మనెంట్ క్లబ్ నడుపుతున్నారు. (13.10.96)

**93. రాష్ట్రాల అధికారాలపై ఆరాటం కాని స్థానిక సమస్యలకు మొండి చెయ్యి**

కేంద్రం నుంచి రాష్ట్రాలకు మరిన్ని అధికారాలు కావాలని ఇష్టారాగం ఆలపించే ముఖ్యమంత్రి రాష్ట్రంలో మేయర్లకు, మునిసిపల్ చైర్మన్‌లకు, జెడ్‌పిటిసిలకు, ఎంపిటిసిలకు కనీస అధికారాలు కూడా ఇవ్వలేదని నిరాహారదీక్షలు, తెలుగు శిక్షణా శిబిరాల్లో నిలవేయడాలు జరిగాయి.

**94. ఆంధ్రాను రోజుకొక దేశంగా మార్చివేస్తారట:**

ఒక రోజు ఆంధ్రాను జపాన్‌గా, మరొక రోజు ఆస్ట్రేలియాగా, ఇంకొక రోజు కొరియాగా, ఇంకొక రోజు న్యూజిలాండ్ తరహా పరిపాలన - ఇలా హైటెక్ స్పీడులో రాష్ట్రాభివృద్ధి జరిగి పోతూ ఉంది. ఇలా వెళితే ఆఖరికి రాష్ట్రాన్ని రువాండా, సోమాలి యాగా మార్చేస్తారేమోనని జనం భయం.

**95. ప్రపంచ బ్యాంకు సూపర్ డైరెక్షన్:**

ఆంధ్రప్రదేశ్‌ను జపాన్, కొరియా, ఆస్ట్రేలియా, న్యూజి లాండ్, సోమాలియా తరహాలో నడపాలంటే ప్రపంచ బ్యాంకు డైరెక్షన్ తప్పదు. 11,500 కోట్లు ఋణం కోరినందుకు గాను బ్యాంకు వారికి మన బడ్జెట్ పత్రాలు విధి విధానాలు, ప్రభుత్వ డాక్యుమెంట్లు అన్ని చూపించి మీరు ఎలా చెప్తే అలా నడుచు కుంటామని హైటెక్ ప్రభుత్వం వేడుకున్నది.

ఇంకేముంది ప్రపంచ బ్యాంకు రాష్ట్ర సచివాలయంలో తిష్టవేసి ఏమేమి మార్పులు చేయాలో, ఏ విధానాలు చేపట్టాలో డైరెక్షన్ ఇస్తున్నది. సబ్సిడీల తగ్గింపు, చార్జీల పెంపుదల, పన్నుల హెచ్చింపు, విద్యుత్ సంస్కరణలు, రోడ్ల ఆక్రమణల తొలగింపు, ఇలా అన్నిటికి వారి మాటే పెద్ద వాక్కు. ప్రపంచ బ్యాంకు ఋణం ఇస్తుందని రోడ్డు ప్రక్కనే ఉన్న పేదల ఇళ్ళు కూలగొట్టమని, 50-60 ఏళ్ళుగా నివాసముంటున్న వారి ఇళ్ళు ప్రొక్లైనర్, బుల్ డోజర్స్‌తో కూల్చివేయడం

మొదలుపెట్టింది. పిఠాపురం కోర్టు భవనాలను కూడా పాక్షికంగా కూలగొట్టడంతో కోర్టు చీవాట్లు పెట్టి సంజాయిషీ కోరింది. పేదల ఆర్తనాదాలు ఎక్కువయ్యాయి. విచక్షణా రహితంగా కూల్చివేతకు ప్రతిపక్ష పార్టీలు నిరసన తెలపడంతో సగం కూల్చివేసిన తరువాత, మార్గదర్శక ప్రత్యామ్నాయానికి ప్రభుత్వం ఇప్పుడు ఆలోచిస్తున్నది. ప్రపంచ బ్యాంకు మితిమీరిపోయి ఇక అంతా వారే డిక్టేట్ చేస్తే మేమెందుకని సచివాలయ కార్యదర్శులు అసంతృప్తి చెందుతున్నట్లు వార్తలు.

సబ్సిడీ బియ్యం రేటు పెంపుదల, కోటాకోత నీటి తీరువా పెంపు, వృత్తి పన్ను, బస్ ఛార్జీల పెంపు అవన్నీ ప్రపంచ బ్యాంకు ప్రభువుల వారి ఆదేశమేనట. ఇప్పుడు తాజా ఆదేశం 35 లక్షల కార్డులు తగ్గించేయమన్నదట. ప్రభుత్వ ఆసుపత్రు లలో ఫీజులు వసూలు చేయనున్నదట. ఉద్యోగాలను కాంట్రాక్ట్ పద్ధతిపై తీసుకోనున్నదట. బహుశా అది కూడా జరుగు తుందేమో.

## 96. ప్రపంచ బ్యాంకు అప్పు ఇస్తుందని పక్కా ఇళ్ళ కూల్చివేత

రాష్ట్రంలో రోడ్ల వెడల్పు పేరుతో జరిగిన ప్రహసనం తుగ్లక్ పరిపాలన గుర్తుకు తెస్తుంది. రహదారులపై అడ్డంకులను తొలగించడం, ఆక్రమణలను తొలగించడం ఎవరికీ అభ్యంతరం లేదు. బిజెపి స్వాగతించింది. కాని గ్రామాలలో ఉన్న, అలాగే పట్టణాలలో ప్రధాన రహదారులు లేనిచోట 30, 40 ఏళ్ళుగా కాపురముంటున్న పక్కా కట్టడాలను, గృహాలను కూల్చివేశారు. యుద్ధానంతరం శిథిలాల్లాగా అనేక గ్రామాలు, మండల, కేంద్రాలు మారిపోయాయి. దాంట్లో పక్షపాతం, రాజకీయ చోటుచేసుకున్నాయి. ముందు నోటీసు లేకుండా, సమగ్ర విధా నాన్ని పాటించకుండా బిల్డింగులు కూల్చివేయటంతో, ఆఖరకు హైకోర్టు జోక్యం చేసుకోవలసి వచ్చింది. లక్షలాధి మందిని నిరాశ్రయులను చేసిన తర్వాత ముఖ్యమంత్రిగారు సింపుల్‌గా అధికారులు తొందరపాటుగా వ్యవహరించినందుకు క్షమాపణ తెలుపుతున్నానన్నారు. కూలిపోయిన కుటుంబాల వారి గోడు వినేదెవరు? మామ శ్రీ రామారావు సంవత్సరానికి 5 లక్షల ఇళ్ళు కట్టిస్తే, మరి అల్లుడు కనీసం లక్ష ఇళ్ళన్నా కూల్చకపోతే ఎలా అని భావించినట్లుంది. పేదలకు ప్రత్యా మ్నాయ స్థలాన్ని చూపించటం, సర్వం కోల్పోయిన వారికి ఉపాధి చూపించటం ప్రభుత్వ కర్తవ్యం కాదా?

## 97. హైటెక్ ప్రచారం - లోటెక్ పని విధానం:

షెడ్యూల్డు కులాల వర్గీకరణ జీ.వో.

షెడ్యూల్డు కులాల వర్గీకరణ విషయమై మాలమాదిగలు ఇతర కులాల విషయమై ప్రభుత్వ వర్గీకరణ జి.ఓను రాష్ట్ర హైకోర్టు కొట్టివేసింది. ఆదరాబాదరగా ఆలోచనా రహితంగా, రాజ్యాంగ సూత్రాలను పాటించకుండా జాతీయ షెడ్యూల్డు కులాల కమిషన్‌ను సంప్రదించకుండా జి.ఓను పాస్ చేశారంటే ఈ ప్రభుత్వ ప్రచారం మిన్ను - పరిజ్ఞానం సున్న అనే ఆరోపణ లను నిజం చేస్తున్నది. ఫలతంగా షెడ్యూల్డ్ కులాల విద్యార్థుల అడ్మిషన్లు ఆగిపోయి వారు నానా యాతన పడుతున్నారు.

సెక్రటేరియట్ వద్దకు తమ ఆందోళనకు తెలియజేయ డానికి వచ్చిన మాలలపై ప్రభుత్వం పోలీసుల కాల్పులు జరిపిస్తే ఇద్దరు అమాయకులు చనిపోయారు. కాని విధ్వంస కాండే లక్ష్యంగా పెట్టుకున్న తీవ్రవాదులపై చర్యకు ప్రభుత్వం సిద్ధంగా లేదు.

రైతులపై కాల్పులు - మాలలపై కాల్పులు - అన్యాయం జరిగిందని పోలీసు స్టేషన్‌కి వెళితే మహిళలతో సహా ప్రజలపై కాల్పులు నలుగురి మృతి (నల్లగొండ జిల్లాలో)

## 98. విద్యార్థులపై లాఠీచార్జి కాల్పులు

రాష్ట్రంలోని విద్యార్థుల సమస్యలను ప్రభుత్వ దృష్టికి తెచ్చేందుకు హైదరాబాద్‌లో ప్రదర్శనను నిర్వహించిన ఎబివిపి విద్యార్థులపై లాఠీ ఛార్జి, కాల్పులు జరిపి వీర ప్రతాపం చూపించిన ప్రభుత్వం, నక్సలైట్లు పోలీసు స్టేషన్లు కూల్చేస్తున్నా, మంత్రుల ఇళ్ళను పేల్చేస్తున్నా, విచక్షణా రహితంగా ప్రాణాలు తీస్తున్నా మౌనం వహిస్తున్నది.

## 99. ఎన్.టి.ఆర్. మా నాయకుడు - ఆయనే మా దైవం - అయినా దించేసాం

ఈ ప్రభుత్వ హయాంలో పార్టీల ఫిరాయింపు చట్టం మూగపోయింది. పక్షపాతంతో పని మానివేసింది. శ్రీ ఎన్.టి.ఆర్.పై తిరుగుబాటు చేసిన వారు తమదే అసలైన తెలుగుదేశం అని శ్రీ రామారావును దించివేసి, ఆయన బ్యాంకు అకౌంట్లను జప్తు చేయించి, అధ్యక్ష పదవి నుంచి తొలగించి 'ఆయనే

మా నాయకుడు, ఆయనే మా ఆదర్శం అంటున్నారు' ఇదొక కొత్త రకం హైటెక్ ఆరాధన, భక్తి కాబోలు.

శ్రీ రామారావు ప్రక్కన 39 మంది శాసన సభ్యులు నిలిచారు. తిరుగుబాటుదారులను గుర్తించారు. నానా విమర్శలను చేశారు. ఆయన మరణానంతరం జరిగిన పార్లమెంటు ఎన్నికలలో వారిలో కొందరు సింహం గుర్తుపై పోటీ చేశారు. ఆ పార్టీని ఎలక్షన్ కమిషన్ గుర్తించింది. ఆ పార్టీలో ప్రస్తుతం నలుగురు ఎమ్మెల్యేలే ఉన్నారు. మిగిలిన వారు ఎక్కడికి పోయారో, ఎలా పోయారో, ఎప్పుడు పోయారో, ఎందుకు పోయారో ఎవరికి తెలియదు. అధికార పార్టీలోకి తిరిగి ఫిరాయిస్తే, ఫిరాయింపుల చట్టం కళ్ళు తెరువదు కాబోలు.

### 100. ఇంకా విచిత్రం - విజయవాడ ఉదంతం.

నైతిక విలువల పతనానికి ఈ ఫిరాయింపుల ఉదంతం పరాకాష్ఠ!

విజయవాడలో కాంగ్రెస్ పార్టీ తరఫున గెలిచిన ఎం.ఎల్.ఎ టి.టి.పి తరఫున. జండా మార్చేశారు. తెలుగుదేశం తరఫున గెలిచిన ఎమ్మెల్యే కాంగ్రెస్ జండా కట్టేశారు. రంగు మార్చేశారు. అసెంబ్లీ రికార్డులలో ఒక పార్టీ బయట మరొక పార్టీ - ఇదెలా సాధ్యమని మీరనుకుంటే పొరపాటు - హైటెక్ పాలనలో ఏమైనాసాధ్యమే. మీకు ఆసక్తి ఉంటే గిన్నీస్ బుక్ వారికి వ్రాయండి. ఇది వరల్డ్ రికార్డులో ఎక్కుతుంది. అంతేకాదు తెలుగుదేశంను ఓడించి ఇండిపెండెంట్‌గా గెలిచిన వారు సైతం ఈ ప్రభుత్వంలో మంత్రులే - 'హో అంటారా - అదంతే'

When King can do no wrong - King maker can do anything you can ask nothing.

## పత్రికలేము ఏంటున్నాయి?

### హైటెక్ ప్రభుత్వం లోటెక్ పనితీరు

తుఫాను బాధితుల విషయంలో తేటతెల్లం 'తుఫాన్ బాధితులను అన్ని విధాల ఆదుకుంటాం - ఏమాత్రం వెనుకంజ వేసే ప్రసక్తి లేదు. ఎన్ని వందల కోట్లు ఖర్చయినా ప్రభుత్వం సిద్ధంగా వుంది.

- ముఖ్యమంత్రి 6-11-96 రాజమండ్రిలో

కోనసీమను కబళించిన కనీవిని ఎరుగని తుఫాను బాధితులను ఆదుకోవడానికి రాజమండ్రినే మినీ సెక్రటేరియట్‌గా చేసుకుని వారం రోజులు మకాం చేశారు. స్థానిక యంత్రాంగం సరైన రీతిలో స్పందించకపోయినా, ఎక్కడో వున్న రాజధాని నుంచి వచ్చి బాధితులను ఓదార్చారనే మన్ననలను ముఖ్యమంత్రి పొందగలిగారు. ఇళ్ళు కూలిపోయిన వారికి, అందరికీ ఇళ్ళు కట్టిస్తామని కోనసీమ సంపదైన కొబ్బరి చెట్టుకి ప్రతి చెట్టుకు పరిహారం ఇస్తామని, బలహీన వర్గాల వారికి సహాయం చేస్తామని, దెబ్బతిన్న వాటినన్నిటినీ పునర్నిర్మాణం చేస్తామని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారు.

ఏడాది అనంతరం చేపట్టిన పునర్నిర్మాణ పనులు ఒక్కసారి పరిశీలిస్తే, ముఖ్యమంత్రి హామీలన్నీ వొట్టి మాటలేనని, మాటలకు చేతలకు పొంతన లేదని స్పష్టమవుతున్నది. ముఖ్యమంత్రి హామీ మేరకు ప్రభుత్వం లెక్కల ప్రకారం 4,43,000 ఇళ్ళు నష్టపోయాయి. 288 వేల ఇళ్ళు పూర్తిగా దెబ్బతిన్నాయి. మిగతావి పాక్షికంగా. సంవత్సరమైనా జనసంక్షేమ సమితి, మరో రెండు సంస్థలు మినహా మిగతావన్నీ ప్రకటనలకే పరిమితమయ్యాయి. పాడుపడ్డ షెల్టర్లకు మరమ్మతులు కూడా కరువయ్యాయి. పడిపోయిన ప్రతి చెట్టుకు నష్టపరిహారం చెల్లిస్తామని చెప్పి, పెరట్లో వాకిట్లో కాలువ గట్లపై ఉన్న చెట్లతో ముగించారు.

ఆంధ్రభూమి 6-11-97

తుఫాను సందర్భంగా గృహ నిర్మాణం ఆశించిన స్థాయిలో ఇప్పటికీ జరుగలేదు. కూలిన ఇళ్ళకు, మంజూరైన ఇళ్ళకు, చేపట్టిన ఇళ్ళకు, పూర్తి అయిన ఇళ్ళకు మధ్య నక్కకు, నాగలోకానికి ఉన్న తేడా కనిపిస్తున్నది. తుఫానులో ఘోరంగా

దెబ్బతిన్న భైరవపాలెం, బసు తప్పివంటి మత్స్యకార గ్రామాలను ఈ ఏడాది మార్చి నుండి ఇప్పటి వరకు బాధ్యత గల అధికారి ఒకరు కూడా సందర్శించలేకపోవడమే దీనికి సజీవ సాక్ష్యం. రక్షిత మంచినీటి కల్పన ఇప్పటికీ ఎండమావిగా మిగిలింది. ముఖ్యమంత్రి హామీ గంగలో కలిసింది. చనిపోయిన మత్స్యకారుల కుటుంబాలకు ప్రకటించిన లక్ష రూపాయల ఎక్స్‌గ్రేషియా, 35 వేల రూపాయల భీమా సొమ్ము, ఇంకా ఆమోదముద్రకు నోచుకోలేదు. ఆ విధంగా 1328 మంది సాయం కోసం ఎదురు చూస్తున్నారు. వంతెనలు, కమ్యూనికేషన్లు, ఇతరత్రా కనీస అవసరాల కల్పన జరగలేదు. పంటల భీమా సొమ్ము ఇంకా రైతులకు అందాల్సి వుంది. తుఫాను పనులపై నిర్దేశించిన అఖిలపక్ష చర్యలు ఆగిపోయాయి. (ఈనాడు 6-11-97)

శిథిలమైన నావలు, పడవలు, తెప్పలు నేటికీ కనిపిస్తున్నాయి. ఒరిగిన కమ్యూనికేషన్, కరెంటు స్తంభాలను ఇప్పటికీ చూడవచ్చు. ఇంతటి బీభత్సం తరువాత లక్షలాది ఇళ్ళు నష్టపోయినట్లు అంగీకరించిన ప్రభుత్వం కేవలం కొద్ది వేల ఇళ్ళు మంజూరు చేసింది. నేటికి తుఫాను షెల్టర్ల స్థితి యథాతథంగా ఉండడం విచారకరం. ప్రత్యేక కమ్యూనికేషన్ల టవర్ల నిర్మాణానికి ఉద్దేశించిన ప్రణాళికను పట్టించుకున్న దాఖలాలు లేవు. (-వార్త 6-11-97)

## అవినీతిపై రాష్ట్ర ప్రభుత్వం రాజీ

అవినీతి, అక్రమాలపై కొరడా ఝుళిపిస్తానని పదేపదే చెపుతున్న రాష్ట్ర ప్రభుత్వం ఆచరణలోకి వచ్చే సరికి రాజీ ధోరణి అవలంబిస్తోంది. సాక్షాత్తూ ముఖ్యమంత్రి ప్రత్యక్షంగా రంగంలోకి దిగి అధికారుల అలసత్వాన్ని గుర్తించి, ఆగ్రహించి, బాధ్యుల్ని సస్పెండ్ చేసినట్లు బహిరంగంగా ప్రకటించినప్పటికీ నిజానికి ఏ ఒక్కరూ సస్పెన్షన్‌లో ఉండటం లేదు. అధికారులు దర్యాప్తులో నిజాలు నిగ్గుతేలి, దోషులు సస్పెండ్ అయినా కొన్ని గంటల్లోనే వారి సస్పెన్షన్ తొలగిపోయి యధావిధిగా విధుల్లో చేరిపోతున్నారు. జన్మభూమి పర్యవేక్షణ, ఆకస్మిక తనిఖీల పేరిట ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పలు సందర్భాలలో అనేక మందిని సస్పెండ్ చేస్తున్నట్లు బహిరంగ ప్రకటనలు చేసినప్పటికీ, అప్పటికప్పుడు పత్రికల్లో ఈ వ్యవహారం ప్రముఖంగా రావటం మినహాయిస్తే ఎవరూ సస్పెన్షన్‌కు గురికావటం లేదు. (ఈనాడు 17.11.97)

దేశం ఎదుర్కొంటున్న సవాళ్ళకు బిజెపి విధానాలే సమాధానాలు

- ★ స్వదేశీ, స్వావలంబన ఆధారంగా జాతీయ ఆర్థిక విధానం
- ★ ఒకే దేశం, ఒకే ప్రజ, ఒకే చట్టం, ఆధారంగా ఉమ్మడి పౌరసత్వ చట్టం.
- ★ బడ్జెట్‌లో 60 శాతం నిధులు వ్యవసాయానికి, గ్రామీణాభివృద్ధికి కేటాయింపు.
- ★ ప్రతి చేతికి పని, ప్రతి పొలానికి నీరు - చేతివృత్తులకు చేయూత.
- ★ ఉగ్రవాదంపై ఉక్కుపాదం.
- ★ బలమైన రాష్ట్రాలు, బలమైన కేంద్రం.
- ★ మహిళకు చట్ట సభల్లో 33 శాతం రిజర్వేషన్లు.
- ★ సామాజిక సమరసత
- ★ నైతిక విలువలతో కూడిన రాజకీయాలు
- ★ అన్ని మతాలకు కుటుంబ నియంత్రణ
- ★ దేశ రక్షణకోసం అణుబాంబు తయారీ
- ★ సమగ్ర సత్వర అభివృద్ధికై చిన్న రాష్ట్రాల ఏర్పాటు
- ★ అట్టడుగు వర్గాల అభివృద్ధికై 'అంత్యోదయ' పథకం.
- ★ కాశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తి రద్దు - 370 ప్రకరణాల ఎత్తివేత
- ★ సమిష్టి నాయకత్వం - సమర్థవంతమైన జనాకర్షణ కలిగిన ఉన్నత వ్యక్తిత్వం గల ఉత్తమ నాయకులు
- ★ క్రమశిక్షణ - దేశభక్తి - జాతీయ భావం ఆధారంగా పనిచేసే లక్షలాది కార్యకర్తలు.

రండి, బిజెపితో కలిసి నడుద్దాం. స్వరాజ్యాన్ని సురాజ్యంగా మార్చుకుందాం... ఆకలి, అవినీతి, అశాంతికి తావులేని శక్తిశాలి, స్వాభిమాన భారత్‌నునిర్మిద్దాం.

---

*Printed and Published by* **P.VENUGOPAL REDDY** *on behalf of Bharateeya Janata Party (AP) and Printed at Kala Jyothi Process Limited, RTC 'X' Roads, Hyderabad - 44. Editor:* **K.VENKATESWARLU**, *114/40, Janapriya Towers, Huda Complex, Saroornagar, Hyderabad - 60.*
*Executive Editor:* **A.S.R.Prasad, B.A.** *Published at : 3-6-430, 4th Street, Himayathnagar, Hyderabad - 500 029. Ph. 7607177*

# భవిష్య భాగ్యానికి బంగారు బాట

ఆంధ్రప్రదేశ్‌లోని రియల్ ఎస్టేట్స్ రంగంలో అగ్రగామి సంస్థగా అలరారుతున్న ప్రఖ్యాత 'నార్నే ఎస్టేట్స్' వారి ఆధ్వర్యంలో 'దక్షిణ భారత చండీఘడ్'గా రూపు దిద్దుకుంటున్న ఈస్ట్ సిటీలో పెట్టుబడులకు ఇదే "సువర్ణ" అవకాశం!




## దక్షిణ భారత చండీఘడ్

'ఉద్యోగరత్న' కల్నల్ నార్నె రంగారావు గారి నేతృత్వంలో ఈ సంస్థ పట్టిందల్లా బంగారం అయ్యింది. ప్రణాళికాబద్ధమైన లేఅవుట్‌తో, నివాసయోగ్యమైన సమస్త వసతులతో స్వయం సమగ్రమైన సుందర నగరంగా రూపొందింపబడుతున్న ఈస్ట్‌సిటీలో చక్కటి ఇంటి ప్లాటుని సొంతంచేసుకోండి. కోటి రూపాయలు విలువచేసే బంగారు కానుకలు మీకోసం ఎదురు చూస్తున్నాయని మర్చిపోవద్దు.

## కోటి రూపాయల బంగారాన్ని



## గెలుచుకునే గొప్ప అవకాశం !!

ఒక్కసారి 21వ శతాబ్దపు ఆదర్శ నగరంగా అవతరిస్తున్న ఈస్ట్‌సిటీ విశేషాలను పరిశీలించండి.

### ఈస్ట్ సిటీ విశిష్టతలు :

- పెట్టుబడులకు 100% రక్షణ.
- 24 గంటల రక్షిత నీటి సరఫరా.
- కేంద్రీకృత మురుగునీటి పారుదల / డ్రైనేజ్ వ్యవస్థ.
- చుట్టూ ప్రహరీగోడ, కంచెతో పటిష్టమైన భద్రతా ఏర్పాట్లు.
- ఇరువైపులా నీడ నిచ్చే చెట్లతో విశాలమైన తారు రోడ్లు.
- ఆక్రమణలకు గురయ్యే ప్రసక్తి లేనిది.
- అంతటా కాంతివంతమైన విద్యుద్దీపాలు.
- ప్రతీ బ్లాకులో పార్క్, దుకాణాల సదుపాయం.

★ పూర్తి మొత్తం చెల్లించినవారికి ఆకర్షణీయమైన తగ్గింపు.

★ నెలసరి రూ॥ 750/- లకే సులభ వాయిదాలలో భవిష్య భవ్య నగరంలో మీ స్థానాన్ని పదిల పర్చుకోండి.

*మరిన్ని వివరాలకోసం సంప్రదించండి.




## నార్నే ఎస్టేట్స్

10, గన్‌రాక్ ఎన్‌క్లేవ్, సికింద్రాబాద్ - 9. ఫోన్ : 840266, 844720, 815916.